శ్రీః
శ్రీమతే రామానుజాయ నమః



# భగవద్రామానుజవైభవ సంగ్రహం

పండితరత్న, సంత్సంప్రదాయసుధాంబుధి
**ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి**

**ఉ.వే. మహావిద్వాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామివారి**
**118వ తిరునక్షత్ర మహోత్సవ చిహ్నిక**

**సమర్పణము**

**శ్రీమతి రామావతి, శ్రీమాన్ జి. నరసింహరాజు దంపతులు**
**వారి కుటుంబ సభ్యులు, హైదరాబాద్**

**2016**

# భగవద్రామానుజవైభవ సంగ్రహం

## ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి వారు


ప్రథమ ముద్రణ : ఏప్రియల్, 2016

ప్రతులు : 500

సందర్భం : ఉ॥వే॥ శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామివారి 118వ తిరునక్షత్రోత్సవం

వేదిక : శ్రీభాష్యకార భవనం, కోవెలవీధి, నరసాపురం





ముఖచిత్రం : భగవద్రామానుజులు, శ్రీరంగం


హైదరాబాద్ వాస్తవ్యులు, శ్రీమతి రామావతి, శ్రీమాన్ జి. నరసింహరాజు దంపతులు, వారి కుమారుడు శ్రీమాన్ రఘురామ్, కోడలు చి॥సౌ॥ వల్లీలక్ష్మి, మనుమరాండ్రు చి॥ హరి కీర్తన, చి॥ శ్రీనిత్య - వీరంతా భక్తిపూర్వకంగా సమర్పించిన పవిత్రద్రవ్యంతో ఈ గ్రంథం ముద్రింపబడుతున్నది.

రామావతీనారసింహరాజాఖ్యౌ కృతినా వివౌ ।
యాభ్యాం సమర్ప్యతే భక్త్యా శ్రీరామానుజవైభవమ్ ॥

పరమాచార్యకైంకర్యం యదాచార్యమనోహరమ్ ।
అర్ప్యతే తదిదం శ్రీమద్రామానుజపదాబ్జయోః ॥


డి.టి.పి. : జయలక్ష్మి, చంద్రశేఖర్, తిరుపతి.

ప్రింటింగ్ : సి.ఎన్. ప్రింటర్స్, ప్రకాశంరోడ్ తిరుపతి.




# పరమాచార్య కైంకర్యం

అస్మత్పితామహ చరణులు, ఉభయవేదాంత మహావిద్వాన్ శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి శతాబ్దిమహోత్సవాలు 1999వ సం॥లో అంతర్వేదిపాలెం వైభవంగా నిర్వహింపబడినవి. తరువాత, 2007వ సంవత్సరం, వరకు ప్రతి ఏడు వారి ముఖోల్లాస కైంకర్యంగా శ్రీరామానుజుల తిరునక్షత్ర మహోత్సవాలలో ఒకనాడు విశిష్ట పండిత సత్కార కార్యక్రమం నరసాపురంలో జరుపబడింది. 2008వ సంవత్సరం నుండి పితామహుల తిరునక్షత్రోత్సవాన్ని పురస్కరించుకొని నరసాపురంలో (శ్రీఆదికేశవస్వామి బ్రహ్మోత్సవాలలో సామాన్యంగా అయిదవ ఉత్సవంనాడు, ఎపుడైనా ఆఱవ ఉత్సవంనాడు పితామహుల తిరునక్షత్రం వస్తుంది కనుక, ఆ ఉత్సవ దినాలలో) మూడు దినాలపాటు ఉభయవేదాంత పండితసభలు, ఆ సభానిర్వహణంలో భాగంగా విశిష్ట పండిత సత్కారకార్యక్రమం జరుపబడుతున్నాయి. ఈ సందర్భానికి చిహ్నంగా ఒక సాంప్రదాయిక గ్రంథం కూడా ముద్రింపబడి, ఆస్తికులకు సమర్పింపబడుతున్నది.

ఈ ఏడు ఏప్రియల్ 26, 27, 28వ తేదీలలో నరసాపురంలో పితామహపాదుల తిరునక్షత్రోత్సవ సందర్భంలో జరుపబడే పండితసభల నిర్వహణ, విశిష్ట పండిత సత్కార కార్యక్రమాల చిహ్నికగా శ్రీరామానుజుల చరిత్రను తెలిపే ఒక లఘుగ్రంథం ముద్రింపబడుతున్నది. శ్రీరామానుజ సహస్రాబ్ది మహోత్సవాల పవిత్రస్మృత్యంకంగా ఈ గ్రంథముద్రణ చేయబడుతున్నది. శ్రీశ్రీశ్రీరంగరామానుజ జీయర్ స్వామివారి ఆశ్రమంలో, ఇతరత్ర ఎన్నో కైంకర్యాలను చేసికొన్న భాగ్యాన్ని కలవారు, హైదరాబాద్ వాస్తవ్యులు, శ్రీమతి రామావతి, శ్రీమాన్ జి. నరసింహరాజు దంపతులు, వారి కుమారుడు శ్రీమాన్ రఘురామ్, కోడలు చి॥సౌ॥ వల్లీలక్ష్మి, మనుమరాండ్రు చి॥ హరి కీర్తన, చి॥ శ్రీనిత్య - వీరంతా భక్తిపూర్వకంగా సమర్పించిన పవిత్రద్రవ్యంతో ఈ గ్రంథం ముద్రింపబడుతున్నది. శ్రీనరసింహరాజు దంపతులు, వారి కుమారుడు, కోడలు- అందరూ మా నాయనగారైన శ్రీమాన్ రంగాచార్యస్వామివారిని ఆశ్రయించారు. ఆచార్య కైంకర్యం అంటే - వారు మెచ్చే కైంకర్యమే కనుక, తమకు పరమాచార్యులైన ఉ.వే. శ్రీమాన్ శేషశింగరాచార్యస్వామివారి తిరునక్షత్రోత్సవ సందర్భంలో, శ్రీరామానుజ సహస్రాబ్దిమహోత్సవ సందర్భంలో వీరందరూ చేసుకొనే ఈ కైంకర్యం ఉత్తమమైన ఆచార్యకైంకర్యంగా పర్యవసిస్తుంది కదా! ఈవిధంగా ఆచార్య, పరమాచార్య, జగదాచార్య కైంకర్యాలను చేసుకునే శ్రీమాన్ నరసింహరాజు దంపతులను,వారి కుమారుడు రఘురామ్, కోడలు చి॥సౌ॥ వల్లీలక్ష్మిలను అభినందిస్తూ, వీరి ఆచార్యభక్తి, సంప్రదాయానురక్తి, నిత్యాభివృద్ధం కావాలని కాంక్షిస్తున్నాను. స్వస్తి.

తిరుపతి — ఇట్లు

10-4-2016 — ఈ.ఏ. శింగరాచార్యులు

# భగవద్రామానుజవైభవ సంగ్రహం

## అవతారిక

**యో నిత్య మచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ -**
**వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే!**
**అస్మద్గు రోర్భగవతోస్య దయైకసింధోః**
**రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥**

(ఎల్లప్పుడు బంగారం వలె ఆశపడదగిన అచ్యుతుని పాదపద్మాలలోని వ్యామోహం వల్ల మిగిలిన అన్నిటిని తృణప్రాయంగా తలచినవారు, మాకు ఆచార్యులు దయకు అద్వితీయమైన సముద్రంవంటివారు అయిన భగవద్రామానుజుల శ్రీచరణాలను రెండింటిని శరణంగా ఆశ్రయిస్తున్నాను.)

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థయ సంభవామి యుగే యుగే** (సాధువులను రక్షించడంకోసం, దుర్మార్గులను శిక్షించడం కోసం, ధర్మాన్ని నిలబెట్టడంకోసం నేను ప్రతియుగంలో అవతరిస్తాను) అని, **"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత, అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్"**- ("అర్జునా! ఎపుడెపుడు ధర్మానికి బాధకల్గుతుందో, అధర్మానికి అభివృద్ధి కల్గుతుందో, ఆ సమయంలో నేను నన్ను- నా ఆత్మను- సృష్టించుకొంటాను) అని శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలో అర్జునునితో అన్నాడు. ఇక్కడ **"ఆత్మానమ్"** అనే పదానికి- నన్ను అని, నాకు ఆత్మవంటివాడైన జ్ఞాని అయిన మహానుభావుని- అని అర్థమని పూర్వాచార్యుల వివరణం. అందువల్ల భగవంతుడు తాను అవతరించ వలసి వచ్చినపుడు కొన్ని సందర్భాలలో నేరుగా తానే అవతరిస్తాడని, మఱికొన్ని సందర్భాలలో మహనీయులైన తన భక్తులను అవతరింపజేసి, వారి ద్వారా కర్తవ్య నిర్వహణను చేయిస్తాడని తెలుస్తున్నది. ఆ విధంగా భగవానుడు తానే అవతరించిన అవతారాలు శ్రీరామ, శ్రీకృష్ణావతారాలు కాగా, జ్ఞానులైనవారిని అవతరింపజేసిన సందర్భాలు కొన్ని ఉన్నాయి. వానిలో ఒకటి భగవద్రామానుజావతారం.

**"నాథోపజ్ఞమ్ ప్రవృత్తమ్"** అని శ్రీమన్నాథమునులతో ఆరంభమైన శ్రీవైష్ణవ పూర్వాచార్యరత్నమాలికలో నాయకస్థానాన్ని అలంకరించే ఆచార్య సార్వభౌములు, శ్రీరామానుజులు. సాక్షాత్తు శ్రీరంగనాథుడే విశిష్టాద్వైత సిద్ధాంతం వీరి తిరునామంతో



"ఎమ్బెరుమానార్ దర్శనమ్"గా వ్యవహరింపబడాలని నియమించడం వీరి వైభవానికి ఒక మచ్చు తునక.

శ్రీనాథమునులకు తరువాత, ఉయ్యక్కొణ్డార్ (పుండరీకాక్షులు), మణక్కాల్‌నమ్బి (శ్రీరామమిశ్రులు), వీరి తర్వాత శ్రీమద్యామునమునులు (ఆళవందార్) ఆచార్యపరంపరను అలంకరిస్తున్నారు. తరువాత స్థానాన్ని శ్రీరామానుజులు భూషిస్తున్నారు.

### ఆదిశేషులు శ్రీరామానుజులుగా అవతరించారు

శ్రీయామునాచార్యులవారిని ఆశ్రయించిన ఆచార్యులలో పెరియ తిరుమల నంబి అనే ఆచార్యులు తిరుమలలోని శ్రీవేంకటేశ్వరునకు కైంకర్యం చేస్తూ తిరుపతిలో నివసించేవారు. వారికి తోబుట్టువులు ఇద్దఱు. వారిలో పెద్ద తోబుట్టువు అయిన శ్రీభూమిప్పిరాట్టిని (కాంతిమతీదేవిని) శ్రీపెరుంబూదూర్‌లో నివసించే ఆసూరి శ్రీకేశవయజ్వ వివాహమాడారు. పెరియపిరాట్టియార్ అనే చిన్న తోబుట్టువును మఴలైమఙ్గలమ్ (మధురమంగలమ్)లో నివసించే కమలనయనభట్టర్ వివాహమాడారు. ఈ తోబుట్టువులిద్దరు తమ తమ భర్తలతో కాపురాలు చేసికొనే సమయంలో పూర్వం తెల్పిన రీతిలో ఆదిశేషులు భగవానుని ఆజ్ఞానుసారం తమోమయం అయిన (అజ్ఞానావృతం అయిన) భూలోకాన్ని జ్యోతిర్మయమైన (జ్ఞానపూర్ణం అయిన) లోకంగా చేయడంకోసం అవతరించగోరి, శ్రీపెరుంబూదూర్‌లోని శ్రీభూమిప్పిరాట్టి గర్భంలో ప్రవేశించి, **"కలియుమ్ కెడుమ్ కణ్డుకొణ్మిన్"** (కలి నశిస్తుంది. చూడండి) అనే నమ్మాఴ్వార్ల సూక్తిని సార్థకం చేయడం కోసం చిత్తిరమాసం (మేషమాసం) ఆర్ద్రానక్షత్రంలో అవతరించారు.

### శ్రీరామానుజుల అవతార రహస్యచింతనం

ఈ విధంగా అవతరించిన మహనీయులైన శ్రీరామానుజులు ఆదిశేషుని అపరావతారమని, భగవానుడైన శ్రీమన్నారాయణుని పంచాయుధాల ప్రాదుర్భావ రూపమని విష్వక్సేనుల అవతారమని- ఈవిధంగా పలురీతులలో పెద్దలు వచిస్తారు. **"శేషో వా సైన్యనాథో వా శ్రీపతిర్వేతి సాత్త్వికైః, వితర్క్యాయ మహాప్రాజ్ఞైః"** అని పూర్వాచార్యోక్తి. ఇరామానుశనూఱ్ఱన్దాది ప్రబంధంలో **"అడైయార్ కమలత్తు అలర్‌మకళ్ కేళ్వన్ కైయాఴి యెన్నుమ్ పడైయోడు నాన్దకముమ్ పడర్ తణ్డుమ్ ఒణ్ శార్ఙ్గ**

విల్లుమ్ పుడ్డైయార్ పురి శఙ్గముమ్ ఇన్ద ప్పూతలమ్ కాప్పదఱ్కెన్ఱు ఇడైయే ఇరామానుశ ముని యాయిన యిన్నిలత్తే" (పద్మావతీవిభుని శ్రీహస్తంలోని శ్రీసుదర్శనం, నందకమనే కత్తి, కౌమోదకీగద, శార్ఙ్గమనే విల్లు, పాంచజన్య శంఖం- అనే ఆయుధాలు ఈ లోకరక్షణ కోసం శ్రీరామానుజుల రూపంలో అవతరించాయి) అనే పాశురంలో తిరువరంగత్తముదనార్, "ప్రథయన్ విమతేషు తీక్ష్ణ భావం.... వవృధే పంచ భిరాయుధై ర్మురారేః" అని యతిరాజసప్తతిస్తోత్రంలో వేదాంతదేశికులు శ్రీరామానుజుల పంచాయుధావతార రూపులని పలికారు.

"విష్వక్సేనో యతిపతి రభూత్ వేత్రసార స్త్రిదండః" (విష్వక్సేనులు శ్రీరామానుజులుగా, వారి చేతిబెత్తం, త్రిదండంగా అవతరించాయి) అనే యతిరాజ సప్తతిసూక్తి శ్రీరామానుజులు విష్వక్సేనావతారమనే విషయాన్ని తెల్పుతున్నది.

శ్రీరామానుజులు ఆదిశేషాంశసంభూతులనే విషయాన్ని పలువురు పూర్వాచార్యులు తెలిపారు. శ్రీరామానుజుల అంతరంగ శిష్యులలో ఒకరైన తిరుమల అనంతార్యులు. ఆదిశేషులే శ్రీరామానుజులుగా, శ్రీరామానుజులుగా అవతరించారనే విషయాన్ని చాలా వివరంగా "శ్రీవేంకటాచలేతిహాసమాలా" అనే దివ్యగ్రంథంలో పలికారు. "శ్రీమత్యాం భూతపుర్యా మధిధరణితలం శేష ఆవిర్బభూవ" ఇత్యాది అచటి సూక్తులు స్మరణీయాలు. భగవానుడైన శ్రీమన్నారాయణుడు తనకు అంతరంగ కైంకర్యాన్ని చేసే ఆదిశేషులను చూచి "మీరు భూమిలో జన్మించి, ఆలోకంలోని వారిని ఉజ్జీవింపజేయండి''- అని నియమించగా, ఆ నియమనాన్ని శిరసా వహించి ఆదిశేషులు శ్రీపెరుంబుదూరులో శ్రీకేశవ సోమయాజి పుత్రులై అంతరించాలనేది అచటి సూక్తుల భావం.

శ్రీరామానుజుల ముఖ్యశిష్యులలో వేటొకరు వడుగ నమ్బి. (ఆంధ్రపూర్ణులు). వీరు రచించిన సంస్కృతశ్లోకరూపమైన యతిరాజవైభవమనే గ్రంథంలో "శేషాంశకః కేశవయజ్వదేవ్యామ్" అని ఉన్నది. 'వేదాంతతత్త్వార్థాలను సుస్థాపించడంకోసం, దుర్వాదాలను నిరసించడంకోసం ఆదిశేషాంశతో తేజోనిధి అయిన ఒక మహనీయులు కేశవసోమయాజి ధర్మపత్ని గర్భంలో అవతరించారనేది అచటి శ్లోకాల భావం. భగవద్రామానుజుల పరిపూర్ణ కటాక్షానికి పాత్రులై, వారిపట్ల అనన్యభక్తిని కల గరుడవాహన పండితుడనే మహనీయులు రచించిన దివ్యసూరిచరితమనే మహాకావ్యంలోని పదిహేడవ సర్గలో శ్రీరామానుజుల అవతారప్రసక్తి వచ్చినపుడు "భౌజంగం వపుర్విహాయ శేషభోగీ యద్రూపం త్రిభువనవందితం జగామ" (ఆదిశేషులు తమ సర్పరూపాన్ని విడచి, ముల్లోకాలు కొలిచే శ్రీరామానుజుల రూపాన్ని పొందారు) అని తెలుపబడింది. యాదవప్రకాశులతో బ్రహ్మరక్షస్సు పలికేటపుడు "మీ భక్తులలో ఉన్నవారు, లోకసంరక్షణార్థం ఆదిశేషాంశతో ఈలోకంలో అవతరించినవారైన శ్రీరామానుజులనే ఈ మహనీయులకు భయపడుతున్నాను'' అని పల్కినట్లు అందులో తెలుపబడడం గమనించదగినది.



వేదాంతదేశికుల అవతారమైన శ్రీబ్రహ్మతంత్రజీయర్ రచించిన దివ్యసూరి స్తోత్రంలో "చైత్రార్ద్రాసంభవం విష్ణోర్దర్శనస్థాపనోత్సుకమ్, తుండీరమండలే శేషమూర్తిం రామానుజం భజే" (భగవానుడైన శ్రీమన్నారాయణుని దర్శనాన్ని స్థాపించడం కోసం చైత్రమాసం ఆర్ద్రానక్షత్రంలో తొండమండలంలో అవతరించిన శ్రీరామానుజులను భజిస్తున్నాను) అని కీర్తించబడింది.

ఇరామానుశనూఱ్ఱన్దాది ప్రబంధంలో "నల్లార్ పరవుమిరామానుశన్" అనే 80వ పాశురంలో శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ "అనంతః ప్రథమం రూపం లక్ష్మణస్తు తతః పరమ్, బలభద్ర స్తృతీయ స్తు కలౌ రామానుజః స్మృతః" అనే ఆర్షవచనాన్ని ప్రమాణీక రించారు.

అయితే ఇక్కడ ఒక సందేహం కలుగవచ్చు. పూర్వం తెల్పిన రీతిలో పలువురు పూర్వాచార్యులు శ్రీరామానుజులను ఆదిశేషాంశసంభూతులుగా వర్ణించగా, ఇరామానుశనూఱ్ఱన్దాదిలో యతిరాజసప్తతిలో, పంచాయుధాల అవతారరూపులుగా, విష్వక్సేనుల అవతారవిశేషంగా ఏవిధంగా చెప్పబడింది? అనేది ఆ సందేహం. దీనికి పెద్దలు చెప్పే సమాధానం ఏమంటే- చరిత్ర గ్రంథరచనా శైలి వేఱు. స్తోత్రరచనా శైలి వేఱు. చరిత్రగ్రంథాలలో అవతారరహస్యం యథాతథంగా తెలుపబడుతుంది. స్తోత్రగ్రంథాలలో కవులు తమ బుద్ధిచాతుర్యంతో తాము స్తుతించే మహనీయుల వైభవానికి తగినట్లు పలు రీతులలో వర్ణిస్తారు. ఈవిధమైన ఉత్ప్రేక్ష స్తుతింపబడే మహనీయుల వైభవాన్ని కీర్తించడంలతో పర్యవసిస్తుంది కనుక దోషం లేదు. సందేహానికి చోటు లేదని తెలియాలి.

## నామకరణం, శాస్త్రాభ్యాసం, గృహస్థాశ్రమస్వీకారం

ఆసూరి కేశవసోమయాజి ఈ విధంగా తమకు జన్మించిన కుమారునకు యథాశాస్త్రం జాతకర్మసంస్కారాన్ని చేశారు. కేశవసోమయాజికి పుత్రోదయం కల్గిన

వార్తను పెరియ తిరుమలైనంబి విని ఎంతో సంతోషంతో తిరుమలనుండి శ్రీపెరుంబూదూరుకు వచ్చి, సర్వలక్షణసంపన్నుడైన బాలుని తేజస్సును చూచి, చాలా ఆశ్చర్యపడ్డారు. పన్నెండవనాడు ఆ బాలునకు శ్రీరామానుజులు - ఇళైయాళ్వాన్ అనే పేరును పెట్టారు. క్రమంగా ఆ బాలుడు పెరిగి పెద్దవాడై అన్నప్రాశన-చౌల-ఉపనయ నాది సంస్కారాలను తగిన సమయాలలో పొంది, **"శొల్లార్ తమిళ్ ఒరు మూన్రుమ్ ఎల్లై యిల్లా, అఱనెఱి యావుమ్ తెరిన్దవన్"** (ఇయల్, ఇశై, నాటకమ్ - అనే మూడు విధాలైన ద్రావిడభాషను, అంతులేని ధర్మశాస్త్రాలను అన్నిటిని తెలిసినవాడు) అనే రీతిలో సాంగోపాంగసకల విద్యాపారంగతుడయ్యారు. ప్రాప్తకాలంలో గృహస్థాశ్రమ స్వీకారాన్నికూడా చేసి, కాంచీపురానికి సమీపంలో ఉండే తిరుప్పుట్కుళి అనే క్షేత్రంలో ఉండే యాదవప్రకాశులనబడే ఏకదండిసన్న్యాసి పూర్వపక్షవేదాంతగ్రంథప్రవచనాన్ని చేస్తున్నారని విని, ఆయనవద్దకు పోయి వేదాంతగ్రంథాధ్యయనాన్ని ప్రారంభించారు.

## గోవిందభట్టర్ వృత్తాంతం

ఈ విధంగా శ్రీరామానుజులు యాదవప్రకాశులవద్ద వేదాంత శాస్త్రాధ్యయనాన్ని చేస్తున్నపుడు, శ్రీరామానుజుల పినతల్లి కుమారుడు గోవిందభట్టర్ కూడా మధుర మంగలం నుండి యాదవప్రకాశుల వద్దకు వచ్చి సహాధ్యాయిగా చేరారు. వీరే తరువాతి కాలంలో ఎమ్బార్‌గా ప్రసిద్ధి చెందారు. ఈ గోవిందభట్టర్ శ్రీరామానుజుల పినతల్లి అయిన లక్ష్మీదేవికి తైమాసం (పుష్యమాసం) పునర్వసు నక్షత్రంలో జన్మించారు. తిరుప్పుట్కుళిలో శ్రీరామానుజులు యాదవప్రకాశుల వద్ద వేదాంతశాస్త్రశ్రవణాన్ని చేస్తున్న విషయాన్ని విని తాముకూడా ఆ శాస్త్రాన్ని అభ్యసించాలని వచ్చి చేరారు.

## యాదవప్రకాశులు శ్రుతివాక్యాలకు అపార్థాలను పల్కడం

యాదవప్రకాశులు అద్వైతసిద్ధాంత ప్రవర్తకులు. పలు వేదాంతవాక్యాలకు అర్థం చెప్పేటపుడు పొసగని వివరణాన్ని చేస్తూ ఉండేవారు. ఈ వివరణాలను విన్నపుడు శ్రీరామానుజులకు చాలా పరితాపం కలిగేది. "ఈ శ్రుతివాక్యానికి పొసగే అర్థం ఇది కదా!" అని వివరించిన సందర్భాలుకూడా ఉండేవి. దీనిని విని సహించలేని యాదవ ప్రకాశులు హుంకరించేవారు. ఈ రీతిలో కొన్నాళ్ళు గడచింది. ఒకనాడు ఛాందోగ్యోపని షత్తులోని - **"కప్యాసం పుండరీక మేవ మక్షిణీ"** ( సూర్యమండలంలో వేంచేసి ఉండే భగవానుని నేత్రాలు నిండు నీటిలో పూచిన, బలమైన తామరకాడను కల్గిన, సూర్యునిచే



వికసింపచేయబడిన తామరపూలవంటివి) అనే వాక్యానికి అర్థాన్ని చెప్పేటపుడు యాదవులు "కోతిపిఱ్ఱవంటి ఎఱ్ఱని కన్నులు" అనే జుగుప్సాకరమైన అర్థాన్ని చెప్పగా, దానిని విని సహించలేని శ్రీరామానుజుల కళ్ళనుండి వేడి కన్నీటి బిందువులు స్రవించాయి. **"కప్యాస" శబ్దానికి** ఈ విధంగా అర్థం చెప్పడం! **"గంభీరాంభః సముద్భూత సుమృష్టనాళరవికరవికసిత"** మైన (లోతైన నీటిలో పుట్టిన, బలమైన కాడను కల్గిన, సూర్యుని కిరణాలచే వికసించిన) ఎఱ్ఱ తామరలవంటి నేత్రాలను కలవాడని కదా అర్థం చెప్పడం యుక్తం అని తగిన రీతిలో శ్రీరామానుజులు ఆ శ్రుతికి అర్థాన్ని చెప్పారు. ఈ అర్థాన్ని విన్న యాదవ ప్రకాశులు చాలా కోపించి- "నేను చెప్పినదానిని అంగీకరిస్తేనే శిష్యుడుగా ఉండి, అధ్యయనాన్ని కొనసాగించు. లేకపోతే విడిచి వెళ్ళిపో" అని పరుషంగా పలికాడు. శ్రీరామానుజులు మనస్సులో చాలా నొచ్చుకొని, ఏమీ ప్రత్యుత్తరం చెప్పకుండా మౌనంగా ఉండి, కొన్నాళ్ళపాటు దూరంగా తొలగిపోయారు.

## శ్రీరామానుజులపై హత్యాయత్నం

ఈ విధంగా కొన్నాళ్ళు గడిచిన తరువాత యాదవప్రకాశుల మనస్సులో ఒక దురాలోచన తట్టింది. "ఈ రామానుజులు అసాధారణ మేధాసంపత్తిని, అన్యాదృశమైన ప్రతిభను కలిగినవాడు. ఇతనివల్ల అద్వైతసిద్ధాంతానికి ముప్పు తప్పదు. అందువల్ల ఇతని అడ్డును తొలగించుకోవడం కర్తవ్యం. ఇందుకు ఇతనిని చంపడం తప్ప వేఱే ఉపాయం లేదు." అని నిర్ణయించుకొన్నాడు. యాదవప్రకాశులు శ్రీరామానుజులను కాశీయాత్రగా తన వెంట తీసికొని పోయి, కాశిలోని మణికర్ణికాఘట్టంలో నదిలోకి ముంచివేసి చంపివేయాలని అనుకున్నాడు. ఒకనాడు యాదవప్రకాశులు శ్రీరామానుజు లను పిలిచి - "నీవు లేక పోతే మా మనస్సుకు తృప్తి లేదు. యథాపూర్వం వచ్చి శాస్త్రాధ్యయనాన్ని కొనసాగించు' అని మంచి మాటలను పల్కి, తన శిష్యగోష్ఠిలోనికి మళ్ళీ ఆహ్వానించాడు. మళ్ళీ కొన్నాళ్ళు శ్రీరామానుజులు యాదవునివద్ద వేదాంత శాస్త్రాధ్యయనాన్ని సాగించారు. యాదవప్రకాశులు ఇంతకుముందే తాను మనస్సులో నిశ్చయించుకొన్న పన్నాగాన్ని ఆచరణలో పెట్టదలచి, ఒకనాడు తాను గంగాస్నానం కోసం యాత్రగా వెళ్ళాలని అనుకుంటున్నట్టు చెప్పి, శ్రీరామానుజులతోపాటు శిష్యబృందసహితుడై యాత్రకు బయలుదేరాడు. శ్రీరామానుజులు, గోవిందభట్టర్ - ఇద్దఱూ యాదవప్రకాశులను అనుసరించి వెళ్ళారు. కొంత దూరం యాత్ర సాగించి, వింధ్యపర్వత ప్రాంతాలను చేరిన తరువాత యాదవప్రకాశుల ఇంగితాలలోని భావాలను

పసిగట్టిన గోవిందభట్టర్ శ్రీరామానుజులను రహస్యంగా కలిసి, తన మనస్సులో కల్గిన అనుమానాన్ని వారికి తెలిపి, యాత్రనుండి వెనుదిరిగి పొమ్మని చెప్పారు. శ్రీరామానుజులుకూడా యాత్రనుండి వెనుకకు తిరిగి వెళ్ళిపోయారు.

## ఒకే రాత్రిలో కంచికి తిరిగి రాక

నిర్జనం, నిర్జలం అయిన ఆ మహారణ్యంలో ఒంటరిగా తిరిగి ప్రయాణమైన శ్రీరామానుజులు అడ్డదారిలో కొంతదూరం ప్రయాణం చేసి, అలసట చెంది, ఒక చెట్టు మొదటలో సేదదీరి చుట్టూ పరికించి చూచారు. కనుచూపు మేర దూరంలో ఎక్కడా **"అజ్గోర్ నిழలిల్లై నీరు మిల్లై"** (అక్కడ ఎక్కడా నీడ లేదు, నీరు లేదు) అనే రీతిలో కన్పించింది. ఎవరూ తోడు లేకుండా **"ఆవారార్ తుణై ఎన్ఱు అలైనీర్‌కడలుళ్ అழுన్దుమ్ నావాయ్ పోల్"** (ఎవరు సహాయం కాగలరు? అని అలలు నిండిన నీటిని కల సముద్రంలో మునిగిపోయే నావవలె) అన్నట్లు కలత చెందిన మనస్సుతో దారి తెలియక దిగ్భ్రాంతి చెంది నిలచిపోయారు. భగవానుడు ఇటువంటి పరమసాత్త్వికులను చేయివిడువని స్వభావాన్ని కల అచ్యుతుడు కనుక, శ్రీరామానుజులకు సహాయపడాలని నిశ్చయించుకున్నాడు. ఒక వ్యాధుని వేషంలో కత్తిని, వింటిని చేత ధరించి, భార్యాసహితుడై శ్రీరామానుజులముందు ప్రత్యక్షం అయ్యాడు. శ్రీరామానుజులు ఆ వ్యాధదంపతులను చూడగానే కొంత కలత తీరింది. "మీరు ఎక్కడనుండి వస్తున్నారు? ఎక్కడికి పోతున్నారు?'' అని వారిని శ్రీరామానుజులు ప్రశ్నించారు. దానికి ఆ వ్యాధ దంపతులు - "మేము ఉత్తరదేశంలోని సిద్ధాశ్రమంనుండి వస్తున్నాము. సత్యవ్రత క్షేత్రమనబడే కంచిని చూడాలని వెడుతున్నాము'' అని బదులిచ్చారు. దానిని విని చాలా సంతోషించిన శ్రీరామానుజులు- "అయితే నేను కూడా మీతో వస్తాను'' అని అన్నారు "మంచిది ఆ విధంగానే రండి'' అని ఆ దంపతులు అన్నారు. వారిద్దరు ముందు నడుస్తూ ఉండగా, శ్రీరామానుజులు వారిని అనుసరిస్తూ ప్రయాణాన్ని సాగించారు. వింధ్యారణ్యం దాటే సమయానికి సాయంకాలం అయినది. అక్కడనే తమ సాయంకాల సంధ్యావందనాది కృత్యాలను ముగించుకొని, శ్రీరామానుజులు మళ్ళీ ప్రయాణాన్ని కొంతసేపు చేశారు. అప్పటికి బాగా చీకటి పడినందువల్ల ఇక ఆ రాత్రి సమయంలో ప్రయాణం చేయలేక, అక్కడే వారితో కలసి ఉపవాసంతోనే ఒక చెట్టు మూల విశ్రాంతి తీసికొన్నారు.



అపుడు వ్యాధుని భార్యకు విపరీతమైన దాహం కల్గి, "మంచి నీళ్ళు కావాలి మంచి నీళ్ళు కావాలి'' అని భర్తను అడిగింది- వ్యాధుడు "ఇపుడు ఇక్కడ ఎక్కడా మంచినీళ్ళు లేవు కొంచెం సేపు ఓర్చుకో. తెల్లవారగానే మంచి నీళ్ళను తెచ్చి ఇస్తాను'' అని అన్నాడు. వీరిద్దరి సంభాషణను విన్న శ్రీరామానుజులకు మనస్సులో చాలా బాధ కల్గింది. "అయ్యో! నాకు మహోపకారాన్ని చేసిన వీరి దాహాన్ని తీర్చే అవకాశం ఈప్రాంతంలో కన్పించడంలేదే!'' అనే నిర్వేదంతో కొంచెం సేపు కళ్ళు మూసికొని నిద్రలోకి వెళ్ళిపోయారు. కొంతసేపటికి రాత్రి తెల్లవారింది. ముగ్గురూ లేచి ప్రయాణాన్ని కొనసాగించగా, ఆ వ్యాధదంపతులిద్దరు ఒక బావితీరానికి పిలుచుకొని పోయి, శ్రీరామానుజులను చూచి "నాయనా! మేము చాలా దాహంతో ఉన్నాము. ఈ బావిలోనికి దిగి, నీటిని తెచ్చి మా దాహాన్ని తీర్చు'' అని అన్నారు. శ్రీరామానుజులు ఆ బావిలోనికి దిగి, రెండు చేతుల నిండుగా మూడు మార్లు నీటిని తీసికొనివచ్చి వారికి ఇచ్చాడు. ఆ వ్యాధదంపతులు ఆ నీటిని తృప్తిగా తాగారు. మఱుక్షణంలో ఆ దంపతులు అదృశ్య మయ్యారు. శ్రీరామానుజులు ఎంతసేపు వెదకినా వారి జాడ తెలియలేదు. వారిని ఎలుగెత్తి పిలిచినా సమాధానం రాలేదు. అపుడు శ్రీరామానుజులు కొంచెం దూరం ప్రయాణం చేసి పరికించి చూడగా దూరంగా మిద్దెలతో, మేడలతో కూడిన జనసంచారం కల నగరం కన్పించింది. శ్రీరామానుజులు ఆ దిశలో నడిచి తమకు కన్పించినవారిని ఆ ఊరు ఏమని అడిగారు - "పుణ్యకోటి విమానం ఎదురుగా కన్పిస్తూ ఉండగా ఈ ఊరు ఏఊరని అడుగుతన్నావేమి? ఇది శాలబావికదా! అది కాంచీపురం కదా!'' అని వారన్నారు. శ్రీరామానుజులు తనకు సహాయపడిన వ్యాధదంపతులు సాక్షాత్తు వరదరాజస్వామి, పెరున్దేవిత్తాయారేనని నిశ్చయించుకొన్నారు. **"ఎన్‌కొల్! అమ్మాన్ తిరువరుళ్!"** (ఏమి స్వామి కృప!) అని శిరఃకంపంగా ఆశ్చర్యపడి, **"ఉరుక్కాట్టాదే ఒళిప్పాయో!"** (స్వామీ! నీ రూపాన్ని దర్శింపజేయకుండా అదృశ్యం అయ్యావా!'') అని పలు మార్లు మనస్సులో బాధపడి, కొంచెంసేపటికి తెప్పటిల్లారు. ప్రయాణాన్ని కొనసాగించి కంచిని చేరి వరదరాజస్వామిని సేవించారు. ఆ స్వామి ఎంతో కరుణతో తమకు చేసిన సహాయాన్ని స్మరిస్తూ నిత్యం శాలక్కిణఱు నుండి తిరువారాధనకోసం తీర్థాన్ని తీసికొనివచ్చి సమర్పిస్తూ ఉన్నారు. (ఈ బావికి **"శాలైక్కిణఱు, శాలక్కిణఱు"** అని రెండు పేర్లు ఉన్నాయి.)

## యాదవప్రకాశులు గంగను చేరారు

శ్రీరామానుజుల వృత్తాంతం ఈ విధంగా ఉండగా, ఇక యాదవప్రకాశుల సంగతి ఏమైనదంటే- శ్రీరామానుజులు, గోవిందభట్టర్ తమను అనుసరించి రావడం లేదని గుర్తించిన యాదవప్రకాశులు దారిలో ఒకచోట నిలిచి వారిద్దరికోసం వేచి చూచారు. కొంతసేపటికి గోవిందభట్టర్ వారిని చేరుకున్నారు. యాదవప్రకాశులు వారిని చూచి, "వచ్చావా గోవిందభట్టారకా! శ్రీరామానుజులెక్కడ! కనపడలేదే!" అని అడిగారు. గోవిందభట్టర్ "అయ్యో! నేను శ్రీరామానుజులను చూడలేదే" అని అన్నారు. యాదవప్రకాశులు తమ శిష్యులలో కొందరిని చుట్టూ వెదకి రమ్మని పంపారు. వారు వెదికి తిరిగి వచ్చి శ్రీరామానుజులు ఎక్కడా కన్పించలేదని చెప్పారు. "అయ్యో! శ్రీరామానుజులకు ఈ కీకారణ్యంలో ఏమి ఆపద కల్గిందో! ఏమో!" అని పైకి బాధను నటిస్తూ, తాను తలచిన కార్యం ముందుగానే నెఱవేరిందని మనస్సు లోపల సంతోషిస్తూ యాదవప్రకాశులు ప్రయాణాన్ని సాగించి, గంగానదిని చేరారు.

## గోవిందభట్టర్‌కు శివలింగం దొరికింది

గోవిందభట్టర్ ఒకనాడు గంగానదిలో స్నానం చేస్తూ ఉండగా, వారి చేతిలోనికి ఒక శివలింగం వచ్చి చేరింది. ఆశ్చర్యంతో "ఇదేమి!" అని యాదవప్రకాశులను వారు ప్రశ్నించారు. యాదవప్రకాశులు చాలా సంతోషంతో "నీవు దైవజ్ఞుడవు కనుక గంగాస్నాన ఫలం సిద్ధించినట్లుగా గంగాధరుడైన శివుడు నీ చేతికి చిక్కాడు. సుమా!" అని పల్కి, అప్పటినుండి గోవిందభట్టర్ విషయంలో ఎక్కువ ఆదరాభిమానాలను చూపించసాగారు. ఆనాటినుండి గోవిందభట్టర్‌ను అందఱూ - **"ఉళ్ళఙ్గై కొణర్న్ద నాయనార్"** అనే పేరుతో పిలవడం ప్రారంభించారు. (**"ఉళ్ళఙ్గై కుళిర్న్ద నాయనార్'** అని కూడా పేరు)

యాదవప్రకాశులు గంగాస్నానాన్ని చేసి, యాత్రను ముగించుకొని శ్రీజగన్నాథం, అహోబిలం మార్గంద్వారా తిరుగు ప్రయాణాన్ని సాగించారు. గోవిందభట్టర్ తనకు లభించిన శివలింగాన్ని తగిన చోట ప్రతిష్ఠించి వస్తాను - అని అన్నారు. యాదవప్రకాశులు "ఆ విధంగానే చేసి రా" అని పల్కి, వారిని పంపి, తాను సపరివారంగా కంచికి తిరిగి వచ్చారు. గోవిందభట్టర్ తమ జన్మస్థలం మధురమంగళానికి చేరి, అక్కడ ఆ శివలింగాన్ని ప్రతిష్ఠించి, తరువాత కాళహస్తి అనే శివక్షేత్రానికి పోయి, అక్కడే ఉంటూ అక్కడి శివభక్తులచేత గొప్పగా గౌరవింపబడుతూ, అక్కడి ఆలయ సంప్రదాయాల నిర్వహణలో ప్రధానులై ఉండిపోయారు.



## యాదవప్రకాశులు - శ్రీరామానుజులు

కాంచీపురంలో యాదవప్రకాశులు శ్రీరామానుజులను చూచి ఆశ్చర్యపడి- "శ్రీరామానుజా! రండి! మీకు వింధ్యారణ్య ప్రాంతంలో ఏం కీడు మూడిందోనని ఎంతో భయపడ్డాను. భగవదనుగ్రహంవల్ల ఏదో విధంగా సుఖంగా ఇక్కడకు తిరిగి చేరారు. అంతే చాలు. మళ్ళీ తిరిగి మిమ్ములను చూడగల్గినందులకు చాలా ఆనందంగా ఉన్నది." అని ఆనందాన్ని నటించాడు. శ్రీరామానుజులు దారిలో జరిగిన వృత్తాంతాలను అన్నిటినీ అతనికి తెలియజేశారు. యాదవప్రకాశులు ఈ రామానుజుల తీరు అంతా లోకవిలక్షణంగా ఉన్నదని ఆశ్చర్యపడి, మళ్ళీ తమ శిష్యులతో శ్రీరామానుజులను చేర్చుకొని, ప్రవచనాన్ని కొనసాగించాడు.

## శ్రీయామునులు కంచికి రాక -

దివ్యదేవాలయాలను సేవిస్తూ, ఆ యాత్రాక్రమంలో భాగంగా, ఇద్దఱు శ్రీవైష్ణవులు శ్రీరంగానికి వచ్చి శ్రీరంగనాథుని సేవించి శ్రీయామునుల సన్నిధికి వచ్చారు. యామునులు వారితో మాటలాడే సందర్భంలో శ్రీరంగంలోని విశేషాలు ఏమని ప్రశ్నించినపుడు, ఆ శ్రీవైష్ణవులిద్దఱు శ్రీరామానుజుల వైభవాన్నిగూర్చి, **"కప్యాస"** శ్రుతి మొదలైనవానిని వివరించేటపుడు యాదవప్రకాశులు చెప్పే విపరీతార్థాలను కాదని, సరసమైన అర్థాలను వారు వివరించే తీరునుగూర్చి కూడా తెలిపారు. దానిని విన్న శ్రీయామునుల మనస్సు ఉప్పొంగింది. కుంపటిలో తామరపూవు పూచినట్లుగా అజ్ఞానాంధకారబంధురం అయిన ఈలోకంలో కూడా ఇటువంటి ఒక మహనీయుడు ఉండడమా!- అని ఎంతో విస్మయపడిన యామునులకు అప్పటికప్పుడే వారిని చూడాలనే ఆశ కల్గింది. దివ్యదేశయాత్రగా బయలుదేరి శ్రీయామునులు ఆయా క్షేత్రాలలోని భగవన్మూర్తులకు మంగళాశాసనం చేస్తూ క్రమంగా కంచిని చేరి, వరదరాజస్వామిని సేవించారు. అపుడే ఆ సమయంలోనే యాదవప్రకాశులు తమ శిష్యబృందంతోపాటు వరదరాజస్వామి సన్నిధికి స్వామిసేవకోసం ప్రదక్షిణంగా వచ్చారు. అపుడు ఆళవందార్ తమ వెంట ఉన్న తిరుక్కచ్చినంబిని చూచి, "వీరిలో శ్రీరామానుజులు ఎవరు ?" అని అడిగారు. నంబి "అదిగో! ఎఱ్ఱని రంగుతో ఆజానుబాహువులను కల్గినవారై మధ్యలో వచ్చేవారే శ్రీరామానుజులు" అని చూపించగా, శ్రీయామునులు నిండు మనస్సుతో వారిని **"ఆముదల్వన్ ఇవన్"** అని తమ పరిపూర్ణకరుణాకటాక్షాలకు లక్ష్యం చేశారు.

వరదరాజస్వామిని ఉద్దేశించి **"యస్య ప్రసాదకలయా బధిరః శ్రుణోతి"** ఇత్యాది శ్లోకంలో శ్రీరామానుజులు విశిష్టాద్వైతదర్శన ప్రవర్తకులు అయేటట్లుగా అనుగ్రహించమని శరణాగతి చేశారు. అప్పటికప్పుడు శ్రీరామానుజులతో నేరుగా మాట్లాడాలనే ఉద్దేశ్యం ఉన్నా, అది సరి అయిన సమయం కాదని తలచి, తమ శిష్యులతో పాటు వెనుదిరిగి శ్రీరంగానికి చేరుకున్నారు.

## బ్రహ్మరక్షస్సు చూపిన శ్రీరామానుజుల ప్రభావం

ఆ కాలంలో కాంచీనగర ప్రాంతాన్ని పాలించే పల్లవరాజు కుమార్తెను బ్రహ్మరక్షస్సు పట్టి బాధిస్తూ ఉండేది. ఆ బ్రహ్మరక్షస్సు వదలిపెట్టి పోయేదానికి తగిన ఉపాయం కాని, వ్యక్తికాని కనబడకుండా ఉన్నందున ప్రభువు యాదవప్రకాశులు గొప్ప మంత్రవేత్త అని తెలిసి తన భటులను వారి వద్దకు పంపాడు. వారుకూడా యాదవప్రకాశులను కలసి, విషయాన్ని తెలిపి, బ్రహ్మరక్షస్సునుండి రాజకుమార్తెను రక్షించి, పుణ్యం కట్టుకోమని ప్రార్థించారు. అపుడు యాదవప్రకాశులు భటులతో మీరు బ్రహ్మరక్షస్సు వద్దకు పోయి, రాజకుమార్తెను విడిచిపొమ్మని నేను పల్కినట్లుగా చెప్పండి- అని అన్నాడు. రాజసైనికులు ఆ విధంగానే చెప్పగా, బ్రహ్మరక్షస్సు- "నేనే ఆ యాదవుని పొమ్మన్నానని చెప్పండి'' అని తిరస్కారపూర్వకంగా బదులిచ్చింది. ఆ విషయాన్ని విన్న యాదవ ప్రకాశులు చాలా కోపంతో తమ శిష్యబృందంతోపాటు రాజభవనానికి వచ్చి మహామంత్రాన్ని జపిస్తూ బ్రహ్మరక్షస్సు దగ్గరకు వచ్చి పిడికిలి బిగించగా, బ్రహ్మరక్షస్సు- "ఓయీ! యాదవప్రకాశా! నీవు జపించే మంత్రం నాకు తెలియదని అనుకున్నావా!'' అని అంటూ ఆ మంత్రాన్ని చెప్పి, "ఓ యాదవా! నీ పూర్వజన్మవృత్తాంతాన్ని గూర్చి చెబుతాను, విను. నీవు మధురాంతకంలోని నదీతీరంలో ఉండే పుట్టలో ఒక ఉడుమువై ఉండేవాడవు. శ్రీరంగంలోని శ్రీవైష్ణవులు వేంకటాచలానికి వెళ్ళినపుడు దారిలో అక్కడ స్నానం చేసి భుజించే చోట చిందిన ప్రసాదాన్ని, తీర్థాన్ని నీవు స్వీకరించినందువల్ల నీకు ఈ విద్వజ్జన్మకల్గింది. నేను పూర్వజన్మలో బ్రాహ్మణుడనై పుట్టి అరుదైన గొప్ప యాగాన్ని చేసినవాడను. నీ మంత్రానికా నేను తల ఒగ్గుతాను! నీ పక్కన ఉండే ఆదిశేషాంశావతారులైన శ్రీరామానుజులు పొమ్మంటేనే నేను పోతాను'' అని అన్నది. ఈ మాటను విని యాదవప్రకాశుల ముఖం కత్తివాటుకు నెత్తురు చుక్కలేనట్లు పాలిపోయింది. తేజోవిహీనుడై శ్రీరామానుజులను చూచి "మీరు ఈ రక్షస్సును రాజకుమార్తెను విడిచిపెట్టి పొమ్మని చెప్పండి'' అని అన్నాడు. శ్రీరామానుజులుకూడా



ఆ రీతిలో పల్కగా, బ్రహ్మరక్షస్సు- "మీ శ్రీపాదసంబంధం నా శిరస్సుకు కల్గితే తప్ప నాకు విముక్తి కలుగదు'' అని పల్కి, ఆ విధంగానే శ్రీరామానుజుల పాదాలను శిరస్సుతో స్పృశించి, ఆనందించి, నమస్కరించి "ఇదిగో! ఈమెను విడిచి వెళ్ళిపోతున్నాను'' అని అంటూనే తాను విడిచి వెళ్ళినందుకు గుర్తునుకూడా ప్రదర్శిస్తూ వెళ్ళిపోయింది. యాదవప్రకాశులు శ్రీరామానుజులను పొగడి, తన నివాసాన్ని చేరుకున్నాడు.

## శ్రీరంగంలో శ్రీయామునుల ఆలోచన

శ్రీరంగనాథుని సన్నిధిలో ఆళవందార్ తిరువాయ్‌మొழி కాలక్షేపాన్ని నిర్వహిస్తూ ఉండగా **"ఒన్టుమ్ తేవుమ్"** అనే దశకంలోని **"ఇలిఙ్గత్తిట్ట పురాణ త్తీరుమ్"** అనే పాశురం ప్రస్తావనకు రాగా, "నా తరువాత ఈ సిద్ధాంతాన్ని నిర్వహించగలిగేవారు ఎవరూ కనపడడం లేదే!" అనే విచారం కల్గింది. ఆ విచారం క్రమంగా పెరిగి, శ్రీరామానుజులను స్మరించి, "వీరికి యాదవప్రకాశులతో సంబంధం తీరి, నాతో చేరే ఉపాయం ఏది? ఏదీ లేదా!'' అని నిర్వేదంగా పల్కి, శ్రీకంచి వరదరాజస్వామిని ఉద్దేశించి అంజలిని చేసి, "ఇంతకు ముందే నేను చేసిన ప్రపత్తిని త్వరగా సఫలంచేసి అనుగ్రహించు స్వామీ!'' అని ప్రార్థించారు.

## శ్రీరామానుజులు యాదవప్రకాశుని విడచి పెట్టి, తిరుక్కచ్చినంబికి దగ్గర కావడం

ఆళవందార్ వరదరాజస్వామిని ఉద్దేశించి చేసిన ప్రపత్తి ఫలించే సమయం దగ్గర పడినందున, ఒకనాడు యాదవప్రకాశులకు శ్రీరామానుజులకు మధ్య ఉపనిషద్వాక్యార్థ విచారంలో అభిప్రాయభేదం కల్గింది. ఆనాడు శ్రీరామానుజులు విశిష్టాద్వైత సిద్ధాంత ప్రక్రియను చాలా అద్భుతంగా ఉపన్యసించే అవకాశం కల్గింది. శ్రీరామానుజులు **"స దేవ సౌమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్"** (చంద్రుని వలె అందమైన ముఖాన్ని కలవాడా! సృష్టి ఆరంభంలో సచ్ఛబ్దవాఖ్యుడైన పరమాత్మ ఒక్కడే ఉన్నాడు. రెండవ వస్తువు లేదు) అనే శ్రుతివాక్యానికి విశిష్టాద్వైతసిద్ధాంతానుగుణంగా చేసిన వివరణానికి సమాధానాన్ని ఏరీతిలోను చెప్పలేని యాదవులు. **"శేషం కోపేన పూరయేత్"** అనే లోకోక్తి రీతిలో అంతు లేని కోపాన్ని పొంది, "ఈ నాటినుండి నీవు నాదగ్గరకు అధ్యయనంకోసం రావద్దు. నీబుద్ధికి, ఆలోచనకు తగిన చోటకు పోయి అభ్యసించు, వెళ్ళి పో'' అని చాలా కఠినంగా పలికాడు. ఇదే మంచిది'' అని తలచిన శ్రీరామానుజులు సంతోషంగా తను తల్లిగారితో జరిగిన వృత్తాంతాన్ని తెలియజేశారు. ఆమెకూడా "ఇదంతా మన మంచికే జరిగింది'' అని అంటూ, "నాయనా! ఇంతవరకు నీవు యాదవప్రకాశులవద్ద

చదివినది చాలు. తిరుక్కచ్చినంబి వరదరాజస్వామికి అంతరంగసేవను నిర్వహించే మహాభక్తులు. వారిని అనువర్తిస్తూ, వారి సూక్తి ప్రకారం నడచుకోవడం మంచిది" అని నియమించారు. శ్రీరామానుజులు అదేవిధంగా తిరుక్కచ్చినంబిని సేవించి, వారి నియమనానుసారం పూర్వంవలెనే శాలక్కిణఱునుండి ప్రతిదినం వరదరాజస్వామి తిరువారాధనకు అవసరం అయిన తీర్థాన్ని తెచ్చి సమర్పించే కైంకర్యాన్ని చేస్తూ ఉన్నారు.

## శ్రీరామానుజులను శ్రీరంగానికి తీసికొనిపోవడానికై పెరియనంబి రాక

ఇంతలో, క్రమంగా శ్రీయామునులు శతాధికవర్ష వృద్ధులయ్యారు. వారి శరీరంలో శక్తి సన్నగిల్లింది. **"శాయలొడు మణిమామై త్తళర్న్దేన్ నాన్ ఇని ఉనదు వాయలకిల్ ఇన్నడిశిల్ వైప్పారై నాడాయే"** (మేనిఛాయతోపాటు లావణ్యాన్ని నేను కోల్పోయాను. ఇక నీకు మధురపదార్థాలను సమర్పించేవారిని నీవే అన్వేషించుకో) అని ప్రార్థించే స్థితి కల్గింది. అపుడు కాంచీపురంనుండి యాత్రగా శ్రీరంగానికి వచ్చిన ఇద్దఱు శ్రీవైష్ణవులను చూచి శ్రీరామానుజులను గూర్చి శ్రీయామునులు విచారించారు. అపుడు వారు శ్రీరామానుజులు కొన్ని దినాలుగా యాదవప్రకాశులవద్ద విద్యావ్యాసంగాన్ని విరమించి, తిరుక్కచ్చినంబి పట్ల ప్రావణ్యాన్ని కల్గి, వరదరాజస్వామి కోవెలలో ఆరాధన తీర్థాన్ని సమర్పించే కైంకర్యాన్ని శ్రద్ధగా చేస్తున్నారని తెలియజేశారు. ఆళవన్దార్ చాలా సంతోషించి, తాము చేసిన అంతరంగ ప్రపత్తిని వరదరాజస్వామి త్వరలో సఫలం చేసినందుకు ఆనందించి, తమ అంతరంగ శిష్యులైన పెరియనంబిని పిలచి, ఈ వార్తను వారికి తెల్పి- "మీరు వెంటనే వరదరాజస్వామి సన్నిధికి వెళ్ళి, ఏవిధంగా అయినా శ్రీరామానుజులను ఇక్కడకు పిలుచుకొని రండి" అని ఆజ్ఞాపించి, స్తోత్రరత్నాను సంధానాన్ని ఈ ప్రయత్నంలో ఉపాయంగా చేసికొమ్మని సూచించి, వారిని పంపించారు. పెరియనంబి స్వాచార్యాజ్ఞను శిరసా వహిస్తూ వెంటనే కంచికి బయలుదేరి వెళ్ళారు.

## పెరియనంబి - శ్రీరామానుజులు

తమకు సబ్రహ్మచారి (ఒకే గురువువద్ద విద్య నేర్చినవారు ఒకరికొకరు సబ్రహ్మచారిగా చెప్పబడతారు) అయిన తిరుక్కచ్చినంబి కంచిలోనే ఉన్న సంగతిని తెలిసికొని, వారిని కలసి మంగళాశాసనం చేశారు. అపుడు శ్రీరామానుజులు శాలక్కిణఱునుండి కలశంతో తీర్థాన్ని కోవెలకు తీసికొని వస్తున్న సమయంలో శ్రీరామానుజులకు అభిముఖంగా వారు వచ్చే వీధిలో ఒకచోట ఉన్న పెరియనంబి, శ్రావ్యమైన తమ మధుర గంభీరస్వరంతో స్తోత్రరత్నాన్ని అనుసంధిస్తున్నారు. శ్రీరామానుజులు తమ తలపై తీర్థకలశాన్ని మోస్తూ వచ్చేటపుడు పెరియనంబి అనుసంధించే స్తోత్రరత్నంలోని **"బహ్మా శివః శతమఖః పరమస్వరాడిత్యేతేஉపి యస్య మహిమార్ణవ విప్రుష స్తే"** (బ్రహ్మ, విష్ణు, శివుడు, ఇంద్రుడు మొదలైన వారు నీ మహిమలో తంపురుల వంటివారు) అనే శ్లోకాన్ని ఆలకించారు. వెంటనే ఆగి, పెరియనంబిని చూచి "ఇది ఎవరి సూక్తి?" అని అడిగారు. పెరియనంబి- "ఇది శ్రీయామునుల దివ్యసూక్తి" అని అన్నారు. "అయితే వారిని నేను తప్పక సేవించాలి" అని శ్రీరామానుజులనగా, "సేవించవచ్చు. మాతో వస్తే మీరు శ్రీయామునులను సేవించవచ్చు" అని పెరియనంబి బదులిచ్చారు. ఈ విధంగా కలసికొన్న పెరియనంబి-శ్రీరామానుజులిద్దఱూ ఒకరితో ఒకరు మాటలాడు కొంటూ వరదరాజస్వామి సన్నిధికి వచ్చారు. శ్రీరామానుజులు తిరుమంజనతీర్థాన్ని కోవెలలో సమర్పించి, వరదరాజస్వామి అనుమతిని పొంది, తిరుక్కచ్చినంబి అనుజ్ఞతో పెరియనంబితోపాటు శ్రీరంగానికి బయలుదేరారు.

## శ్రీయామునుల పరమపదయాత్ర

పెరియనంబిని కాంచీపురానికి పంపిన తరువాత కొన్ని దినాలలోనే ఆళవందార్ తిరుమేనిలో అనారోగ్యం అధికమై, పరమపదాన్ని చేరే సమయం ఆసన్నమైనది. చాలా శ్రమతో కోవెలకు వేంచేసి అమలనాదిపిరాన్‌ను అనుసంధించి, శ్రీరంగనాథుని శ్రీచరణాలను సేవించి, ఆ స్వామి అనుగ్రహించిన బహుమానాన్ని స్వీకరించారు. పరమపదాన్ని చేరడానికి శ్రీరంగనాథుని అనుజ్ఞను పొంది తమ మఠానికి తిరిగి వచ్చారు. ఉపనిషత్తులను, దివ్యప్రబంధాలను శిష్యులు అనుసంధిస్తూ ఉండగా వింటూ **"అన్దమిల్ పేరిన్బత్తు అడియరోడు ఇరున్దమై"** (అంతు లేని ఆనందాన్ని అనుభవించే దాసులతో కలసి ఉండడమనే) స్థితిని పొంది ఆనందించాలని ఆశపడి, తమ ఆచార్యులైన మణక్కాల్ నమ్బి శ్రీపాదాలను స్మరిస్తూ, బ్రహ్మరంధ్రమార్గంద్వారా పరమపదాన్ని చేరారు. వారి శిష్యులు తిరువరఙ్గప్పెరుమాళ్ అరైయర్ మొదలైనవారు వేరు తెగిన చెట్టువలె పడి రోదించగా, అక్కడ ఉండేవారు వారిని ఓదార్చారు. ఆళవన్దార్ కుమారులైన పిళ్ళైక్కు అరశు నమ్బిని పురస్కరించుకొని తరువాత నిర్వహించవలసిన చరమ కైంకర్యాలకోసం ప్రయత్నించి, **"ఆళవన్దార్‌పడి"** అని ఇప్పటికీ వ్యవహరించే విలక్షణ క్రమంలో కార్యకలాపాలను నిర్వర్తించారు. తిరుక్కరమ్బన్‌తుఱై అనే చోట ఆళవందార్

చరమశరీరాన్ని స్థాపితం చేయడంకోసం బ్రహ్మరథంలో ఊరేగింపుగా తీసికొని వెళ్ళారు. పెరియనంబి శ్రీరామానుజులతోపాటు కావేరీనదీసమీపంలోకి వచ్చిన సమయానికి అక్కడ తిరుక్కరమ్బన్ తుఱైలో శ్రీయామునుల చరమకైంకర్యాలు నిర్వహింపబడుతున్నాయి.

## శ్రీరామానుజులు శ్రీయామునుల చరమతిరుమేనిని సేవించడం

పెరియనంబి తిరుక్కరమ్బన్ తుఱైలో గుమిగూడిన జనాన్ని చూచి, తమకు ఎదురు వచ్చినవారిని అడిగారు. వారు ఆళవన్దార్ పరమపదాన్ని చేరిన వృత్తాంతాన్ని తెలిపారు. ఆ సంగతిని విన్న పెరియనంబి, శ్రీరామానుజులు ఇద్దఱూ మూర్ఛిల్లి, కొంతసేపటికి తేరుకొని, కనీసం వారి విమలచరమదేహాన్ని అయినా సేవించగలిగాము కదా- అని కొంత ఊరటను చెందారు. శ్రీయామునుల చరమశరీరాన్ని దగ్గరగా వెళ్ళి ఆపాదచూడం సేవించినపుడు, శ్రీరామానుజులు, వారి చేతిలోని మూడు వేళ్ళు ముడుచుకొని ఉండడాన్ని గమనించారు. "ఇంతకు ముందు కూడా వేళ్ళు ఈ విధంగా ముడుచుకొని ఉన్నాయా? ఇపుడు మాత్రమేనా?'' అని వారి శిష్యులను శ్రీరామానుజులు అడిగారు. వారు "పూర్వం ఈ విధంగా ముడుచుకొని లేవు. ఇపుడే ఈవిధంగా చూస్తున్నాము'' అని బదులిచ్చారు. "వీరి మనస్సులో ఏవైనా కొఱతలు కొన్ని ఉండి ఉండాలి'' అని పల్కి, శిష్యులను చూచి, "పూర్వం వీరు వ్యాఖ్యానం చేసేటపుడు వీరి అభిమతసల్లాపాలనుగూర్చి వీరు పలికేటప్పుడు మీరు విని ఉంటారు. తమ మనస్సులో మెదిలే కొఱతలను కొన్నిటిని మీరేమైనా గుర్తించారా!'' అని అన్నారు. శిష్యులపుడు "వీరు ఎప్పుడూ మూడు విషయాలనుగూర్చి ప్రస్తావిస్తూ ఉండేవారు. బాదరాయణ ప్రణీతాలైన బ్రహ్మసూత్రాలకు విశిష్టాద్వైతమతానుసారంగా వ్యాఖ్యానం ఒకటి సువిశదంగా రచింపబడాలి- అనే కోఱిక, నమ్మాళ్వార్ల తిరువాయ్మొళికి వ్యాఖ్యానం అవతరించాలి- అనే కోఱిక, వ్యాసపరాశరమహర్షుల విషయంలో కృతజ్ఞతానుసంధానం చిరకాలం ఉండేటట్లుగా ఏదైనా తచ్చిహ్నంగా కార్యాన్ని చేయాలనే కోఱిక - ఈ విధంగా మూడు కోఱికలు వీరి మనస్సులో ఉండేవి. ఇవి తప్ప ఇంకేమీ మాకు తెలియవు'' అని అన్నారు.

## శ్రీరామానుజులు కంచికి తిరిగి చేరుకున్నారు

శ్రీరామానుజులు దీనిని వినగానే, శ్రీయామునుల చరమతిరుమేని ముందు సాష్టాంగపడి, చేతులను జోడించి నమస్కరిస్తూ - "ఈ శరీరం దృఢంగా ఉండి, ఆచార్యుల కృప పరిపూర్ణంగా నాపట్ల ఉండి, సర్వేశ్వరుడు నేను తలచిన రీతిలో అనుకూలిస్తే ఈ మూడిటిని నేను నెఱవేరుస్తాను'' అని ప్రమాణం చేశారు. అప్పటివరకు ముడుచుకొని ఉండే యామునులు చేతివేళ్ళు చిత్రంగా విడుచుకున్నాయి. దీనిని అక్కడ ఉండే అంతా చూచి ఆశ్చర్యపడి "శ్రీరామానుజా ! ఈ మహాచార్యుల కటాక్షం మీపై పూర్ణంగా ఉన్నదిసుమా! ఇక మీరే ఈ దర్శనానికి నిర్వాహకులు'' అని అంటూ ప్రశంసించారు. శ్రీరామానుజులు శ్రీయామునుల దివ్యరూపాన్ని కన్నులలో, మనస్సులో ప్రతిష్ఠించుకొని, వారి శ్రీపాదాలను సేవించగల్గినందువల్ల సకలార్థాలు తమకు **"నిధిరవ్యయః"** అన్నట్లు చేర్చిపెట్టిన తఱగని నిధివలె లభించినట్లు భావించారు. అయినా, "కనీసం ఒకటి, రెండు నాళ్ళయినా, వారితో సహవాసం కలుగలేదే!'' అని తమ భాగ్యలోపానికి చాల ఖేదపడి, **"పణవాళరవణై ప్పల్లులకాల ముమ్ పళ్ళికొళ్ మణవాళన్ నమ్మై వైత్త పరిశిదు కాణ్మిన్"** (పడగలను కల ఆదిశేషునిపై చిరకాలం పవళించే శ్రీరంగనాథుడు మనకు అనుగ్రహించిన బహుమానం ఇది సుమా!) అని అనుకుంటూ అవభృథస్నానాన్ని చేసి, పెరియనంబివద్ద అనుమతిని పొంది, శ్రీరంగనాథుని సేవించకుండానే కంచికి తిరిగి వచ్చారు. "ఆళవందార్‌తో నేను కలసి ఉండి ఉన్నట్లయితే పరమపదానికి సోపానమార్గాన్ని నిర్మించి ఉండేవాడనే" అని పలు మార్లు శ్రీరామానుజులు తమ శిష్యులతో అనేవారట. అనంతరం శ్రీయామునుల చరమకైంకర్యాలు యథావిధి నిర్వహింపబడ్డాయి. శ్రీరామానుజులు యామునుల పరమపద గమన వార్తను తిరుక్కచ్చి నంబికి తెలుపగా, ఆచార్యవిశ్లేషానికి వారు చాలా బాధపడ్డారు. శ్రీరామానుజులు యథాపూర్వం కంచిలో ఉంటూ వరదరాజస్వామి ఆరాధనకు తీర్థాన్ని సమకూర్చే సేవను చేస్తూ కొంతకాలం గడిపారు.

## తిరుక్కచ్చినమ్బిపట్ల శ్రీరామానుజులు ప్రతిపత్తి

తిరుక్కచ్చినంబిపట్ల శ్రీరామానుజులు చాలా గౌరవంతో, భక్తితో ఉండేవారు. వారి శ్రీపాదాలను ఆశ్రయించాలనే భావం ఒకనాడు వారికి కల్గి, వారి దగ్గరకు పోయి, తమ మనస్సులోని కోఱికను వారి ముందు విన్నవించారు. కాని, తిరుక్కచ్చినంబి అది అప్పటి వర్ణాశ్రమధర్మవ్యవస్థకు విరుద్ధమని, తాము ఆ ధర్మవిరుద్ధమైన పనిని చేయలేమని అంటూ సున్నితంగా తిరస్కరించారు. "మిమ్ములను ఆశ్రయించే భాగ్యం కల్గించకపోయినా, **"పోనకమ్ శెయ్‌ద శేడమ్ తరువరేల్ పునిదమన్రే!"** (భగవద్భక్తులు

తాము ఆరగించగా మిగిలిన ప్రసాదశేషాన్ని ఇచ్చినట్లయితే, అది పవిత్రం కదా) అని అన్నట్లు "మీరు ఈనాడు మా ఇంట్లో ఆరగించి, మీ భుక్తశిష్టాన్నాన్ని మాకు అనుగ్రహించాలి" అని శ్రీరామానుజులు అర్థించారు. తిరుక్కచ్చినంబి "సరే" అని అన్నారు. శ్రీరామానుజులు ఎంతో ఆనందంతో తమ ఇంటికి వచ్చి, ఈ వార్తను తమ ధర్మపత్నికి తెలిపి, షడ్రసోపేతం అయిన విందును సిద్ధం చేయవలసినదిగా ఆమెతో పలికారు. తరువాత తమ నిత్యకైంకర్యం అయిన తిరువారాధన తీర్థాన్ని తీసికొని వచ్చే సేవను కూడా వేగంగా ముగించుకొని శ్రీరామానుజులు ఇంటికివెళ్ళి గృహార్చారాధనను చేశారు. అప్పటికీ తిరుక్కచ్చినంబి రానందువల్ల వారిని పిలుచుకొని రావడం కోసం దక్షిణవీథిలో పడమటి దిశగా వెళ్ళారు. ఆ సమయంలోనే నంబి ఉత్తరవీథి ద్వారా శ్రీరామానుజుల ఇంటికి వచ్చి, తిరువాలవట్టకైంకర్యానికి శీఘ్రంగా వెళ్ళవలసి ఉన్నదని అంటూ తొందరపెట్టి, చాలా వేగంగా తమ ఆరగింపును ముగించుకొని వెళ్ళిపోయారు. శ్రీరామానుజుల ధర్మపత్ని తిరుక్కచ్చినంబి ఆరగించిన స్థలాన్ని, పాత్రలను శుద్ధి చేసి, తానుకూడా స్నానాన్ని చేశారు. ఇంతలో నంబి కోసం వెళ్ళిన శ్రీరామానుజులు, వారు తమ గృహానికి వెళ్ళినట్లు తెలిసికొని, ఇంటికి తిరిగి వచ్చి చూచారు. తిరుక్కచ్చినంబి అప్పటికే భుజించి వెళ్ళిపోయినందువల్ల వారికి కన్పించలేదు. శ్రీరామానుజులు తమ పత్నిని చూచి "తిరుక్కచ్చినమ్బి మన ఇంటికి వచ్చి వెళ్ళారా!" అని అడిగారు. ఆమె "ఆ శ్రీవైష్ణవుడు వచ్చి, ఆలవట్టం వీచే కైంకర్యానికి ఆలస్యం అవుతున్నదనే తొందరలో శీఘ్రంగా భుజించి వెళ్ళాడు. అతడు తక్కువ జాతివాడు కావడంవల్ల అతడు భుజించిన ఆకును తీసివేసి, పాత్రలను కడిగి గోమయంతో శుద్ధిచేశాను. నేను కూడా శుద్ధి కోసం స్నానం చేశాను" అని అన్నారు. శ్రీరామానుజులు తాము ఆశపడ్డ రీతిలో జరుగనందులకు, తిరుక్కచ్చినంబి విషయంలో తమ ధర్మపత్ని అపచారపడినందులకు మనస్సులో చాలా నొచ్చుకొని, "భగవానుని అభీష్టం ఈ విధంగా ఉన్నపుడు చేయగల్గినది. ఏదీ లేదు కదా!" అనే నిరాశతో మౌనంగా ఉండిపోయారు.

## తిరుక్కచ్చినంబి ద్వారా ఆఱు వార్తలు

మఱునాడు శ్రీరామానుజులు తిరుక్కచ్చినంబి వద్దకు పోయి - "నా మనస్సులో కొన్ని విషయాలనుగూర్చి ఆలోచిస్తున్నాను. వాటి నిర్ణయాన్ని మీరు వరదరాజస్వామిని గూర్చి తెలిసికొని దాసునకు (నాకు) తెలియజేయాలి" అని ప్రార్థించారు. నంబి సరే అని పల్కి, ఆనాటి రాత్రి వరదరాజస్వామికి ఆలవట్టం వీచే కైంకర్యాన్ని చేస్తూ స్వామిని అడిగి, తాము తెలిసికొన్న ఆఱు సమాధానాలను శ్రీరామానుజులకు మఱునాడు తెలిపారు. అవి సంప్రదాయంలో తిరుక్కచ్చినంబి ఆఱు వార్తలుగా ప్రసిద్ధి చెందాయి. ఆ ఆఱు వార్తలు ఏవి? అంటే - **1.** నేనే (శ్రీమన్నారాయణుడే) పరతత్త్వం, **2.** చిదచిదీశ్వర భేదమే దర్శనం **3.** ప్రపత్తి మోక్షోపాయం, **4.** అంతిమస్మృతి అక్కఱ లేదు. **5.** ప్రకృత శరీరావసానంలో మోక్షం కల్గుతుంది. **6.** పెరియనంబిని శ్రీరామానుజులు ఆశ్రయించాలి - అనేవి. ఈ విధంగా ఆఱు వార్తలను పొందిన శ్రీరామానుజులు, అవి తమ అభిప్రాయానుగుణంగా ఉన్నందులకు చాలా సంతోషించారు. మహాపూర్ణులను (పెరియనమ్బిని) ఆశ్రయించాలని నిశ్చయించుకొని అందుకోసం శ్రీరంగం చేరుకోవాలని ప్రయాణమయ్యారు.

## శ్రీరామానుజులు మధురాంతకంలో పెరియనమ్బిని ఆశ్రయించడం

ఆకాలంలో శ్రీరంగంలో విశిష్టాద్వైతదర్శననిర్వాహం కోసం శ్రీరామానుజులను అక్కడికి రప్పించుకొని, వారిని అక్కడే ఉండేటట్లుగా చేసికోవాలని ఆశపడ్డ ఆచార్యులు పెరియనంబిని చూచి "ఆపని మీవల్లనే సాధ్యం అవుతుంది. కనుక మీరే స్వయంగా కంచికి వెళ్ళి కార్యాన్ని సఫలం చేసికొని రండి" అని ప్రార్థించారు. పెరియనంబి తత్క్షణం సకుటుంబంగా శ్రీరంగంనుండి కంచికి శ్రీరంగనాథుని అనుజ్ఞను పొంది, బయలుదేరారు. దారిలో నడుమ ఉండే మధురాంతకం క్షేత్రంలో **"ఏరి కాత్త రామన్"** (చెఱువును కాపాడిన శ్రీరాముని) సన్నిధివద్దకు వచ్చారు. అప్పటికి వరదరాజస్వామి ఆజ్ఞానుసారం కంచినుండి శ్రీరంగానికి బయలుదేరిన శ్రీరామానుజులుకూడా అదే చోటికి చేరుకున్నారు. ఈ విధంగా పెరియనమ్బిని, శ్రీరామానుజులు యాదృచ్ఛికంగా మధురాంతకంలో కలిసి, తమ అదృష్టానికి ఆనందించారు. "ఇక ఆలస్యం చేయవలసిన అక్కఱ లేదు." అని భావించి, అపుడే అక్కడే తమకు పంచసంస్కార ప్రదానాన్ని చేయవలసినదిగా శ్రీరామానుజులు పెరియనమ్బిని అర్థించారు. పెరియనమ్బి శ్రీరామానుజుల ఆర్తిని గమనించి, వారు ప్రార్థించిన రీతిలోనే వారికి పంచసంస్కారాలను చేసి, "శ్రీయామునుల శ్రీపాదాలే రక్షకమని భావించండి" అని ఉపదేశించారు. అక్కడినుండి తిరిగి బయలుదేరి పెరియనంబి, శ్రీరామానుజులు కంచికి వచ్చి చేరారు. శ్రీరామానుజులు తమ గృహంలోనే పైభాగంలో పెరియనంబి సకుటుంబంగా నివసించే

సౌకర్యాన్ని కల్గించి, అక్కడ, వారు వంట చేసికోవడానికి అవసరమైన పదార్థాలను సమర్పించి, ఆరాధిస్తూ, వారి సన్నిధిలోనే దివ్యసూరుల ప్రబంధాలను, దర్శన రహస్యార్థాలను శ్రవణం చేశారు.

## పెరియనంబి శ్రీరంగానికి తిరిగి రాక

ఈరీతిలో గడచిన తరువాత కొన్నాళ్ళకు పెరియనంబి ధర్మపత్నికి శ్రీరామానుజుల ధర్మపత్నికి మధ్య మనఃస్పర్థలు కలిగాయి. ఇద్దరు బావి దగ్గర నీరు చేదుకొనే తాడును ఉపయోగించే విషయంలో పరస్పరం పరుషంగా మాటలాడుకొన్నారు. దీనిని పెరియనంబి గమనించి తమ భార్యపై కోపపడి, ఇక తాము ఆక్కడ ఉండడం తగదని తలచి, వెంటనే శ్రీరంగానికి వెళ్ళిపోవాలని నిశ్చయించుకొన్నారు. ఈ సంగతిని శ్రీరామానుజులకు చెప్పకుండానే, వారు అనుష్ఠానానికి వెళ్ళిన సమయాన్ని చూచి, కుటుంబంతోపాటుగా బయలుదేరారు. శ్రీరామానుజులు అనుష్ఠానాన్ని ముగించుకొని తిరిగి వచ్చి, పెరియనంబి కనపడకపోవడంతో విచారించగా, జరిగిన సంగతి తెలిసింది. పెరియనంబి విషయంలో జరిగిన అపచారానికి శ్రీరామానుజుల మనస్సు చాల బాధపడింది. పెరియనంబి శ్రీరంగాన్ని చేరుకొని, అక్కడ యథాపూర్వం శ్రీరంగనాథుని సేవిస్తూ ఉండిపోయారు.

## శ్రీరామానుజుల సన్న్యాసాశ్రమస్వీకారం

శ్రీశఠకోపసూరి తిరువాయ్మొழி ప్రబంధంలోని ఒక దశకంలో ఫలశ్రుతిని తెలుపుతూ -**"నల్లపదత్తాల్ మనైవాழ்వార్ కొణ్డపెణ్డిర్ మక్కళే"** అని అంటూ గృహస్థాశ్రమజీవనాన్ని ఫలంగా అనుగ్రహించారు. సర్వోపకారక్షమం అయిన ఈ ఆశ్రమజీవనం చాలా మంచిదే అయినా **"నల్ల పదత్తాల్ మనైవాழ்వర్"** అనే రీతిలో సరిగా లేకపోతే పరిత్యాజ్యమే అవుతుంది. కనుక, సహధర్మచారిణి అయిన పత్ని మనస్సు తనకు అనుకూలం కానపుడు ఈ ఆశ్రమజీవనంలో జిహాస (విడచిపెట్టాలని కోరిక) కల్గడం సహజం. శ్రీరామానుజులు తమ ధర్మపత్ని విషయంలో ఈక్రింది మూడు దోషాలను గమనించారు. 1. తిరుక్కచ్చినంబి విషయంలో తమ అభిప్రాయానికి విరుద్ధంగా ప్రవర్తించడం. 2. ఒకనాడు ఒక శ్రీవైష్ణవునకు ప్రసాదం పెట్టమని అన్నపుడు ఇంటిలో ప్రసాదం ఉన్నా, లేదని పల్కి పెట్టకపోవడం, 3. ఆచార్యుల ధర్మపత్నితో తగవులాడి ఆమె విషయంలో అపచారపడడం - అని. ఈ మూడు కార్యాలు



శ్రీరామానుజులకు అసహ్యాపచారాలుగా తోచాయి. వెంటనే గృహస్థాశ్రమాన్ని త్యజించి, సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించాలనే కోటిక కల్గి, ఆ సమయంలోనే తమ భార్యను పుట్టినింటికి పంపి వేసి, వరదరాజ స్వామి సన్నిధికి వెళ్లి, అనంతసరస్సుతీరంలో దండకాషాయాలను పరిగ్రహించారు. శ్రీరామానుజముని అని, యతిరాజులని లోకం అంతా కీర్తించేటట్లుగా పేరు పొంది, వరదరాజస్వామి సన్నిధిలో అంతరంగకైంకర్యాలను నిర్వహిస్తూ ఉన్నారు.

## కూరేశులు, దాశరథి శ్రీరామానుజులను ఆశ్రయించడం

శ్రీరామానుజులు ఈవిధంగా ఆశ్రమస్వీకారాన్ని చేసినట్లు తెలిసిన ముదలియాణ్డాన్ (దాశరథి - అని వీరికి పేరు. వీరు శ్రీరామానుజులకు మేనల్లుడు) కూరత్తాழ்వాన్ విని వారి శ్రీపాదసన్నిధిని చేరి, వారిని ఆశ్రయించి పంచసంస్కారాలను పొందారు. శ్రీరామానుజుల సన్నిధిలో పూర్వోత్తరమీమాంసాశాస్త్రాలను వీరిద్దరు అభ్యసించారు. "ఈ గోష్ఠిలో అన్వయించవలసిన గోవిందభట్టర్ కాళహస్తిలో విపరీత ప్రవర్తనతో వ్యర్థంగా కాలం గడుపుతున్నారే!'' అని మనస్సులో కొఱతపడిన శ్రీరామానుజులు వారిని సంస్కరించి, విశిష్టాద్వైతసంప్రదాయంలో వారికి రుచి కలిగేటట్లు చేయమని తిరుమలై నంబిని ప్రార్థించారు.

## యాదవప్రకాశులు శ్రీరామానుజులను ఆశ్రయించడం

శ్రీరామానుజుల ప్రభావం దినదిన ప్రవర్ధమానమై, నలు దెసల వ్యాపించింది. దానిని చూచిన యాదవప్రకాశుల తల్లి, "నా కుమారుడుకూడా శ్రీరామానుజులను ఆశ్రయించి, ఉజ్జీవిస్తే బాగుండును' అని భావించి, తన మనోరథాన్ని కుమారునకు తెలిపింది. యాదవప్రకాశులు అప్పటికే శ్రీరామానుజుల విలక్షణమైన మేథావిలాసాన్ని ప్రత్యక్షంగా చూచినందున, బ్రహ్మరాక్షస్సుద్వారా శ్రీరామానుజుల మహిమను విశేషించి గమనించినవారైనందున తాము నిర్వహించే దర్శనంలో చాలా అతృప్తి తమకే కల్గినందున, భగవత్కటాక్షం ఫలించే కాలం సమీపించినందువల్ల తల్లి పల్కిన హితాన్ని ఆలకించి అంగీకరించారు. అంతవరకు శిఖాయజ్ఞోపవీతాలను విడిచి పెట్టిన పాపానికి పరిహారంగా భూప్రదక్షిణాన్ని చేయవలసి ఉన్నా, తనకు వయసు మీరిన కారణంగా అది చేయలేనందువల్ల చాలా బాధపడ్డారు. అపుడు వరదరాజస్వామి యాదవప్రకాశులకు స్వప్నంలో కన్పించి, "మన శ్రీరామానుజులను ఒకసారి ప్రదక్షిణం చేస్తే అది

భూప్రదక్షిణంకంటే గొప్పది? అందువల్ల ఆ విధంగా చేయాలని అనుకో'' అని నియమించాడు. తిరుక్కచ్చినంబిద్వారా ఈ నియమనాన్ని దృఢంగా విశ్వసించి, శ్రీరామానుజుల సన్నిధికి వచ్చి అనుతాపంతో దండం పెట్టి కన్నీరు విడిచి- **"పఱ్ఱుతే పల పకలుమ్ పోయిన"** (వ్యర్థంగా పలు దినాలు గడచిపోయాయి) అని బాధపడమేకాక, ''ఇకపై అయినా ఈ ఆత్మ ఉజ్జీవించే మంచి ఉపాయాన్ని మీరే చూపాలి'' అని పలు మార్లు ప్రార్థించారు. శ్రీరామానుజులు యాదవప్రకాశుల ప్రార్థనను మన్నించి అతనిని అంగీకరించారు. ఈ విధంగా శ్రీరామానుజులచేత అనుగ్రహింపబడ్డ యాదవులు శ్రీవైష్ణవయతివేషాన్ని ఆ నాటినుండి అంగీకరించి తరించారు. ఈ విషయాన్ని శ్రీవేదాంతదేశికులు యతిరాజసప్తతి అనే స్తుతిలో **"స్వబలాదుద్ధృతయాదవప్రకాశః"** అని అంటూ శ్లేషాలంకార భంగిమలో ప్రస్తావించారు.

## తిరువరఙ్గప్పెరుమాళ్ అరైయర్ వరదరాజస్వామిని ప్రార్థించడం

శ్రీరామానుజులు కాంచీపురంలో కూరేశులకు, దాశరథికి, మిగిలిన శిష్యులకు ఉభయవేదాంతప్రవచనాన్ని చేస్తూ ఉండగా, శ్రీరంగనాథుని ఆలయంలో దర్శననిర్వాహకులుగా ఎవరూ లేని కొఱత తీరడంకోసం శ్రీరామానుజులను శ్రీరంగానికి తీసికొని రావాలనే అభిప్రాయం అక్కడి ఆచార్యులందఱికీ కల్గింది. దానికి తగిన ఒక ఉపాయాన్నికూడా వారు ఆలోచించారు. వరదరాజస్వామి దివ్యప్రబంధగానంలో అమితమైన అభినివేశాన్ని కలవాడు కనుక, మన అరైయర్ స్వామిని తీసికొనిపోయి, దివ్యప్రబంధసూక్తులను వరదరాజస్వామి ముందు వారిచే గానం చేయించి, సంతోషపెట్టి, ఆ స్వామి ప్రసాదంగా శ్రీరామానుజులను వరంగా పొంది, వారిని శ్రీరంగానికి తీసికొని రావాలనే ఉపాయాన్ని ఆచార్యులందఱూ ఆలోచించారు.

ఆ కాలంలో పాశురాలను గానం చేసి విన్నపించడంలో చాలా సమర్థులైన ఆఴ్వార్ తిరువరఙ్గప్పెరుమాళ్ అరైయర్‌ను శ్రీరంగనాథుడు కంచికి పోయి పైకార్యాన్ని నిర్వహించి రావలసినదిగా అర్చనముఖంగా ఆజ్ఞాపించాడు. ఆ ఆజ్ఞను శిరసా వహించి అరైయర్ స్వామి కంచిలోని వరదరాజస్వామి సన్నిధికి వచ్చి చేరి, అక్కడ ఉండే వరమ్ తరుమ్ పెరుమాళ్ అరైయర్‌ను, తిరుక్కచ్చినమ్బిని పురస్కరించుకొని వరదరాజస్వామి శ్రీపాదాలను సేవించి, **"అత్తియూరాన్ పుళ్ళై యూర్వాన్"**, **"ఎన్నెఞ్జ మేయాన్"**, **"ఉరన్తరు మెల్లణై ప్పళ్ళికొణ్డాన్"** ఇత్యాది పాశురాలను దేవగానప్రక్రియలో వరదరాజస్వామి



సమక్షంలో ఆ స్వామి మనస్సు కఱగిపోయేటట్లు ఎంతో శ్రావ్యంగా గానం చేశారు. వరదరాజస్వామి మనస్సులో చాలా ఆనందించి, "అరైయర్‌స్వామీ! మీగానం వల్ల చాలా తృప్తి కల్గింది. మీరు ఏది అడిగినా ఇస్తాను అడగండి'' అని అనుగ్రహించాడు. అరైయర్ తమ సమీపంలో ఉండే శ్రీరామానుజులను చూపించి, ''మన శ్రీరామానుజులను శ్రీరంగనాథునకు ఇవ్వండి. ఇదే నేను అడిగే వరం'' అని ప్రార్థించారు. ఆమాట విని వరదరాజస్వామి ఉలిక్కిపడ్డాడు. శ్రీరామానుజుల విశ్లేషం తనకు సహించరానిదే అయినా, ఏమీ చేయలేక తాను పల్కిన మాటను కాదనలేక, మిన్నకుండిపోయాడు. అపుడు అరైయర్ "స్వామీ! నీవు ఇచ్చిన మాటను నిలబెట్టుకొని శ్రీరామానుజులను మాతో శ్రీరంగానికి పంపించు'' అని పదే పదే ప్రార్థించారు. ''మన శ్రీరామానుజులను తప్ప ఇంక దేనినైనా అడగండి'' - అని నేను ముందే అనడం మరచిపోయాను. ఇక, శ్రీరామానుజులను పంపించకుండా వేఱే దారి ఏమీ కనపడడం లేదే - అని నిశ్చయించుకొని వరదరాజ స్వామి- "అరైయర్ స్వామీ! మీరు నన్ను ఈ విధంగా వంచించి వశీకరించుకోవాలనే వచ్చినట్లున్నారు. నేనుకూడా మీ ఉపాయానికి పట్టుబడ్డాను. ఇక చేసేది ఏమున్నది? మీరు అడిగినట్లే శ్రీరామానుజులను తీసికొని వెళ్ళండి'' అని అనుజ్ఞ ఇచ్చాడు. తత్క్షణమే అరైయర్ శ్రీరామానుజులు కూరేశులు, దాశరథి మొదలైన శిష్యులతో పాటు బయలుదేరి, అరైయర్‌స్వామిని అనుసరిస్తూ శ్రీరంగాన్ని చేరారు. కావేరీనదిలో స్నానం చేసి, నిత్యవిధులను నిర్వర్తించి, ఆదిశేషునిపై పవళించి ఉండే శ్రీరంగనాథుని కళ్ళార దర్శించి, "దాసునిపై ఇన్నాళ్ళకు ఇటువంటి నీ దయాప్రవాహం ప్రవహించిందా స్వామీ!'' అని ఆశ్చర్యపడి, ఎంతో ఆర్తితో సేవిస్తూ నిలిచారు. శ్రీరంగనాథుడు తమ పాదుకలను వారి శిరస్సుపై ఉంచి, శ్రీరామానుజా! **"పొఙ్గోదమ్ శూఴ్న్ద పువనియుమ్ విణ్ణులకుమ్"** (పొంగే సముద్రం చుట్టూ ఉండే భూమి, పరమపదం) అనే ఉభయ విభూతిసంపదను మీకు, మీకు సంబంధించినవారికి అనుగ్రహించాను. ఇక మీరు మా ఆలయాన్ని సంస్కరించి, సరి చేయండి'' అని నియమించాడు. అప్పటినుండి శ్రీరామానుజులకు **"ఉడైయవర్"** (ఉభయవిభూతులను సొత్తుగా కలవారు, స్వామి) అనే పేరు ప్రసిద్ధమైనది. ఈవిధంగా శ్రీరంగనాథుని కరుణను పొంది, అక్కడే ఉన్న పెరియనంబిని చూచి **"పెరియార్‌క్కు ఆట్పట్టక్కాల్ పెఱాద పయన్ పెఱుమాఱు వరివాళ్ వాయరవణైమేల్"** (పెద్దలకు దాసుడైతే పొందడానికి వీలు కాని ఫలాన్ని పొందే తీరును ఒంటిపై గీతలను కల, నిశితమైన నోళ్ళను కల

ఆదిశేషునిపై పరుండిఉండే శ్రీరంగనాథుడు చూపించాడు) అని పల్కి, తమ శ్రీపాదసంబంధాన్ని పొందిన ప్రభావంచేతనే శ్రీరంగనాథుడు నన్నీవిధంగా విషయీకరించాడు- అని ఆనందబాష్పాలు ప్రవహించగా విన్నవించారు. పెరియనంబి కూడా **"కలియుమ్ కెడుమ్ కణ్డుకొణ్మిన్"** (కలి నశిస్తుంది. చూడండి) అని అంటూ ఆళ్వార్లు పల్కిన భవిష్యత్కాల వార్త ఇపుడు ప్రత్యక్షంగా ఫలించిన తీరును చూడగలిగాము. చాలా సంతోషంగా ఉన్నది. ఇక శ్రీరంగనాథుని ఆజ్ఞానుసారంగా ఇక్కడ మీరు కైంకర్యాన్ని నిర్వహించవచ్చు.'' అని అన్నారు. అప్పటినుండి శ్రీరామానుజులు -**"తెన్నరఙ్గర్ శెల్వమ్ ముఱ్ఱుమ్ తిరుత్తువైత్తాన్ వాళియే"** (దక్షిణదిక్కులో ఉండే శ్రీరంగనాథుని సంపదను అంతటినీ సంస్కరించినవారు వర్ధిల్లాలి) అని కీర్తించే రీతిలో శ్రీరంగాలయంలోని కైంకర్య వ్యవస్థను, ఆచార్యవ్యవహారాలను చక్కదిద్ది, నిత్యోత్సవ-పక్షోత్సవ-మాసోత్సవ-సంవత్సరోత్సవాలను అన్నీ కొఱత లేకుండా జరిగేటట్లుగా కట్టడి చేశారు. ఆ పనిలో అకలంకనాట్టాళ్వాన్ అనే ప్రభువు శ్రీరామానుజులకు తనవంతు సహకారాన్ని అందించాడు.

### తిరువరఙ్గత్తముదనార్‌ను సంస్కరించిన వృత్తాంతం

తిరువరఙ్గత్తముదనార్ (శ్రీరంగామృతకవి) అనే మహనీయులొకరు శ్రీరంగాలయంలోని ఆచారాలను, సంప్రదాయాలను నిర్వహించేవారిలో ముఖ్యులు. ఒకనాడు వారు శ్రీరామానుజుల దగ్గరకు వచ్చి "ఎన్నో పాపాలను నిండుగా చేసిన నన్ను సంస్కరించి భగవానునకు శేషభూతుణ్ణి అయ్యే రీతిలో చేయగలిగేవారిని మీశిష్యులలో ఒకరిని నియమించాలి'' అని అర్థించారు. శ్రీరామానుజులు కూరేశులను పిలిచి, అముదనార్‌ను చూపించి "వీరు మనకు పెన్నిధి అయిన శ్రీరంగనాథుని ఆలయంలోని నిర్వాహకులు వీరిలోని లోపాలను మీరు లెక్కించకుండా, వీరిని అనుసరిస్తూ, మీకు అనుకూలంగా చేసికొని, మావద్దకు తీసికొని రండి'' అని అన్నారు. కూరేశులు అముదనార్‌ను ఆఱునెలల పాటు అనువర్తించి, సంస్కరించి, శ్రీరామానుజుల శ్రీపాదాల వద్దకు తీసికొని వచ్చారు. అపుడు శ్రీరామానుజులు వారిని కూరేశులవద్ద పంచసంస్కారాలను పొందేటట్లు నియమించారు.

### తిరువరఙ్గత్తముదనార్‌నుండి శ్రీరంగాలయపౌరోహిత్యాన్ని కూరేశులు పొందడం

కూరేశుల సన్నిధిలో తిరువరఙ్గత్తముదనార్ అంతరంగకైంకర్యాలను చేస్తూ, వారివద్ద రహస్యగ్రంథాలను అధ్యయనం చేస్తున్న సమయంలో, అముదనార్ తల్లి



పరమపదించారు. దశాహం వరకు చరమకైంకర్యాలను నిర్వహించిన తరువాత, ఏకాదశ శ్రాద్ధానికి తగిన భక్తకు ఎవరికైనా నియమించవలసినదిగా అముదనార్ శ్రీరామానుజులను ప్రార్థించారు. శ్రీరామానుజులు కూరేశులను అందుకోసం వెళ్ళమని ఆజ్ఞాపించారు. కూరేశులు ఏమీ సంకోచించకుండా, కాదనకుండా శ్రీరామానుజుల హృదయాన్ని గమనించి, వారి ఆజ్ఞను శిరసా వహించారు, ఏకాహశ్రాద్ధంలో భోక్తృస్థానంలో నియంత్రణం చేయబడ్డ కూరేశులు చివరలో తమకు తృప్తి కల్గిందనే అర్థాన్ని ఇచ్చే **"సకలం సంపూర్ణమ్"** అనే మాటను చెప్పవలసి ఉన్నది. ఎంత సేపయినా ఆ మాటను అనకపోవడంవల్ల అముదనార్ ఆళ్వాన్‌ను అందుకు గల కారణాన్ని ప్రార్థించారు. అపుడు కూరేశులు అముదనార్ అధీనంలో ఉండే పౌరోహిత్యాధికారాన్ని తమ అధీనం చేయమని అన్నారు. మాఱు మాట పల్కకుండా అముదనార్ ఆ అధికారాన్ని బీగాలతో పాటుగా కూరేశులకు సమర్పించారు. కూరేశులు దానిని తిరిగి శ్రీరామానుజులకు సమర్పించారు. అప్పటినుండి **"రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్"** అని కీర్తించే రీతిలో శ్రీరంగాలయంలోని కైంకర్యవ్యవస్థను శ్రీరామానుజులు సంస్కరించి క్రమబద్ధీకరించారు.

### ఎమ్బార్ సంస్కరింపబడ్డ విషయాన్ని విని ఆనందించడం

పూర్వం యాదవప్రకాశులు గంగాస్నానయాత్రను చేసినపుడు గోవిందభట్టర్ తనకు లభించిన శివలింగాన్ని ఆరాధిస్తూ, శ్రీవైష్ణవసహవాసాన్ని విడచి, కాళహస్తిలో శివపూజానిరతులై ఉండిపోయారు. వారి మనస్సును సంస్కరించి, విశిష్టాద్వైత సంప్రదాయంలో అభినివేశాన్ని పొందినవారినిగా వారిని చేయడంకోసం శ్రీరామానుజులు తమ మేనమామ అయిన పెరియ తిరుమలై నంబిని ప్రార్థించారు. తిరుమలైనంబి తిరుమలైనుండి కాళహస్తి పోయి, గోవిందభట్టర్‌ను మార్చడంకోసం రెండు సార్లు ప్రయత్నించారు. కాని, వీలు కాలేదు, మూడవసారి వారి ప్రయత్నం సిద్ధించింది. ఈ సంగతిని శ్రీవైష్ణవులొకరు శ్రీరామానుజుల శ్రీపాదాలలో ఈక్రింది విధంగా విన్నవించారు.

తిరుమలైనంబి ఒకనాడు కొంతమంది తమ శిష్యులతో కలసి కాళహస్తికి పోయి, ప్రతిదినం గోవిందభట్టర్ శివపూజకోసం పూవులను కోయడానికై వచ్చే చోటుకు సమీపంలో ఉండి, తిరువాయ్‌మొళిలోని శ్రియఃపతి పరత్వాన్ని చక్కగా నిరూపించే **"తిణ్ణన్ వీడు"** దశకాన్ని అనుసంధిస్తూ దానిని వివరించడం ప్రారంభించారు. గోవిందభట్టర్ అలవాటు ప్రకారం అక్కడకు వచ్చి, పాదిరి (గన్నేరు) పూలచెట్టు పైకి

ఎక్కి పూవులను కోయడం ప్రారంభించారు. మూడు పాశురాలవరకు గోవిందభట్టర్ పూవులను కోయడం మానివేసి తిరుమలైనంబి గానం చేసే పాశురాలను విన్నారు. నాల్గవ పాశురంలో **"తేవ నెమ్బెరుమానుక్కల్లాల్ పూవుమ్ పూశనైయుమ్ తకుమే"** (దేవుడైన భగవానునకు తప్ప పూలు, పూజ వేఱొకరికి తగునా?) అనే సూక్తిని గంగాప్రవాహంతో సమానంగా వ్యాఖ్యానించే తిరుమలైనంబి శ్రీసూక్తిని విని, గోవిందభట్టర్ ఆ చెట్టునుండి కిందకు దిగి, తన చేతిలో ఉండే పూల బుట్టను విసరివేసి, ధరించిన రుద్రాక్షమాలను విసరికొట్టి, **"పూవుమ్ పూశనైయుమ్ తకుమే"** అనే ప్రశ్నకు సమాధానంగా "తగదు! తగదు!" అని అంటూ తిరుమలైనంబి శ్రీపాదాలలో పడి, "ఇంతకాలం అజ్ఞానంలో పడి ఉన్న ఈ దాసుడు ఇకపై అయినా ఉజ్జీవించేటట్లు చేయాలి" అని ప్రార్థించారు. తిరుమలనంబి గోవిందభట్టర్‌ను వాత్సల్యంలో పట్టి పైకి ఎత్తి, ప్రేమగా నిమిరి, వారి మనస్సును మంచి మాటలతో చల్లబఱచి, ఓదార్చారు. ఈ విషయాన్ని అక్కడ ఉండే శివభక్తులు తిరుమలైనంబి వద్దకు వచ్చి, "ఈ విధంగా మీరు చేయడం తగునా?" అని వారితో వాదులాడినా, నంబి చెప్పిన సమాధానానికి వారు తృప్తిపడి తిరిగి వెళ్ళిపోయారు. గోవిందభట్టర్ తాము ధరించిన శైవచిహ్నాలను అన్నిటినీ తీసివేసి, ప్రాయశ్చిత్త సంస్కారాలను చేసికొని, తిరుమలైనంబి తప్ప వేఱు దైవం లేదన్న రీతిలో వారు శ్రీపాదాలే రక్షకంగా భావించి సేవిస్తూ ఉన్నారు. శ్రీరామానుజులు పై వృత్తాంతాన్ని శ్రీవైష్ణవుల ద్వారా విని మనస్సులో చాలా సంతోషించారు.

## భగవద్రామానుజుల పంచాచార్యసమాశ్రయణం

శ్రీరామానుజులు శ్రీయామునుల శిష్యులలో ముఖ్యులైన అయిదుగురు ఆచార్యులను ఆశ్రయించి, వారివల్ల అర్థవిశేషాలను తెలిసికొన్నందున వారికి **"పంచాచార్యపదాశ్రితః"** అనే ప్రసిద్ధి కల్గింది. పెరియనంబి, తిరుక్కోట్టియూర్‌నంబి తిరుమాలైయాణ్డాన్, పెరియ తిరుమలై నంబి, ఆళ్వార్ తిరువరఙ్గ ప్పెరుమాళ్ అరైయర్- అనే వారు ఈ అయిదుగురు ఆచార్యులు. వీరిలో శ్రీరామానుజులకు పంచసంస్కారాలను ప్రసాదించిన శ్రీరామానుజులు ముఖ్యులు. తిరుక్కోట్టియూర్ నంబి రహస్యార్థాలను ఉపదేశించారు. తిరుమాలైయాణ్డాన్ తిరువాయ్‌మొழி ప్రబంధంయొక్క అర్థాన్ని ఉపదేశించారు. తిరుమలైనంబి శ్రీరామాయణంలోని సంప్రదాయార్థాలను ప్రసాదించారు. ఆళ్వార్ తిరువరఙ్గ ప్పెరుమాళ్ అరైయర్ దివ్యసూరుల దివ్యప్రబంధాలను, స్తోత్రాలను, సద్వార్తలను అనుగ్రహించారు. శ్రీదేశికులు ఈ వివరాలను తమ



గురుపరంపరాసారమనే గ్రంథంలో - **"ఎమ్బెరుమానార్ తిరుక్కోట్టియూర్‌నమ్బి శ్రీపాదత్తిలే రహస్యార్థఙ్గళ్ శిక్షిత్తార్. తిరుమాలైయాణ్డాన్ ఆళవన్దారాళ్వార్ శ్రీపాదత్తిలే తిరువాయ్‌మొழியు మోది, స్తోత్రఙ్గళ్ అరుళిచ్చెయల్‌కళుమ్, నల్ వార్త్తైకళుమ్ కేట్టరుళినార్. తిరుమలై నమ్బి శ్రీపాదత్తిలే శ్రీమద్రామాయణమ్ కేట్టరుళినార్"** అని అనుగ్రహించారు. (ఆళవన్దారాళ్వార్ అంటే - ఆళ్వార్ తిరువరఙ్గప్పెరుమాళ్ అరైయర్.

## శ్రీరామానుజులు - తిరుక్కోట్టియూర్‌నమ్బి

పెరియ నమ్బి భగవద్రామానుజులకు ఎంతో ఆదరంతో రహస్యార్థాలను అనుగ్రహించే సమయంలో "తిరుక్కోట్టియూర్ నంబి వద్ద కొన్ని విశేషార్థాలు నిక్షిప్తాలై ఉన్నాయి. ఆళవన్దార్ విశేషకటాక్షానికి వారు పాత్రులు కావడంవల్ల వారి దగ్గర నిధివలె ఉండే అర్థవిశేషాలను విని, మీరు ఉజ్జీవించండి" అని అన్నారు. శ్రీరామానుజులు ఆ రహస్యార్థాలను వినాలనే ఉత్కంఠతో తిరుక్కోట్టియూర్‌కు వెళ్ళారు. అక్కడ ఉన్నవారిని చూచి "ఇక్కడ తిరుక్కోట్టియూర్ నంబిగారి తిరుమాళిగ ఎక్కడ ఉన్నది?" అని అడిగారు. అపుడు వారు "అదిగో! కన్పించేదే నంబి గృహం" అని చూపించారు. అక్కడినుండి తిరుక్కోట్టియూర్‌నంబి ఇంటివరకు శ్రీరామానుజులు దండం పెడుతూ, నంబి ఇంటికి చేరారు. ఆ ఊరిలో ఉండేవారికి ఆనాడే అపుడే తిరుక్కోట్టియూర్ నమ్బి గొప్పతనం ఎంతటిదో తెలిసింది. శ్రీరామానుజులు తిరుక్కోట్టియూర్‌నంబి శ్రీపాదాలకు నమస్కరించి "తమరు దాసునకు రహస్యార్థవిశేషాలను అనుగ్రహించాలి" అని జోడించిన చేతులతో ప్రార్థించారు. వారుకూడా శ్రీరామానుజుల అధ్యవసాయ విశేషం ఎటువంటిదో తెలియకుండా ఉపదేశించకూడదని తలచి, ఊరికే ఉండిపోయారు. శ్రీరామానుజులు కొన్నాళ్ళు వేచి చూచి, మనోరథం పూర్తి కాకుండానే తిరిగి శ్రీరంగానికి వెళ్ళిపోయారు. ఈ విధంగా పద్దెనిమిది సార్లు శ్రీరంగంనుండి తిరుక్కోట్టియూర్‌కు శ్రీరామానుజులు వచ్చినా, నంబిని ప్రార్థించినా ఫలం కలుగలేదు. అపుడు ఇన్నిసార్లు తమ వద్దకు వచ్చిన శ్రీరామానుజుల అంతు లేని ఆర్తిని, అభినివేశాతిశయాన్ని తెలిసిన తిరుక్కోట్టియూర్ నంబి భగవాను నియమనాన్ని పొంది, శ్రీరామానుజులకు ఇక ఉపదేశించవచ్చునని నిశ్చయించుకొని, ఒక శ్రీవైష్ణవులను శ్రీరంగానికి పంపించారు. ఆ శ్రీవైష్ణవ స్వామి శ్రీరామానుజుల దగ్గరకు వచ్చి, నంబి ఆజ్ఞను తెలుపగా, శ్రీరామానుజులు చాలా సంతోషించి, కూరేశులను, ముదలియాణ్డాన్‌ను వెంటబెట్టుకొని వేగంగా తిరుక్కోట్టియూర్ చేరి, నంబి శ్రీపాదాలలో నమస్కరించి నిలచారు.

"మిమ్ములను ఒంటరిగా రమ్మనికదా చెప్పాను. మీతో పాటు ఇంకా ఇద్దఱిని వెంటబెట్టుకొని వచ్చారేమి!'' అని తిరుక్కోట్టియూర్ నంబి ప్రశ్నించారు. "త్రిదండపవిత్రాలతో కదా మీరు రమ్మని నన్ను ఆదేశించారు. వీరిద్దరు నాకు త్రిదండం, పవిత్రంవంటివారే. అందుకే నేను వీరిని పిలుచుకొని వచ్చాను.'' అని పల్కి కూరత్తాళ్వాన్ పవిత్రంగా, ముదలియాణ్డాన్ త్రిదండంగా చూపించి నిలచారు. అపుడు నంబి "అయితే, ఇపుడు నేను ఉపదేశించే రహస్యార్థాలను మీ ముగ్గురిలోనే ఉండాలి. వేఱెవ్వరికీ మీరు చెప్పకూడదు'' అని నియమించి, వారిచే ఆ విధంగా శపథం చేయించి, చరమశ్లోకంలోని పరమరహస్యార్థవిశేషాలను ఎంతో ఆదరంతో ఉపదేశించారు.

## "ఎమ్బెరుమానార్" అనే బిరుదును పొందడం

తిరుక్కోట్టియూర్‌నంబి తమ దగ్గర శ్రీరామానుజులు శపథం చేసి, దానిని అతిక్రమించి ఈ విధంగా సన్నిధిలో పలువురకు వ్యక్తంగా రహస్యార్థాలను ఉపదేశించారని విని, వారిని తమ వద్దకు పిలిపించి, "ఈ విధంగా మీరు నాకిచ్చిన మాటను ఉల్లఘించండం తగునా? ఎందుకోసం ఈ విధంగా చేశారు? ఆచార్యాజ్ఞోల్లంఘనానికి ఫలం ఏమి? అని తెలుసునా?'' అని ప్రశ్నించారు. వెంటనే ఉడైయవర్ "ఆచార్య నియమనాన్ని అతిలంఘించిన పాపిని నేను. నాకు నరకమే గతి. దీనిని తెలిసినా నేను ఈ రహస్యార్థాలను వ్యక్తం చేయడంలో ఉద్దేశ్యం ఏమంటే - దాసుడొక్కడు నరకానికి పోయినా, ఈ జీవులంతా తమ అనుగ్రహంతో ఉజ్జీవిస్తారు కదా! - అని'' అని విన్నపించారు. నమ్బి శ్రీరామానుజుల సమాధానాన్ని విని, వారి హృదయవైశాల్యాన్ని గమనించి, "ఈ విధంగా ఇతరుల సమృద్ధిని తన సమృద్ధిగా తలచే స్థితి నాకు కల్గలేదే! వీరు ఎంతటి ఔదార్యం కల్గి ఉన్నారు!'' అని అత్యాశ్చర్యంతో సంతోషించి, ఆ సంతోషాతిశయం వల్ల **"ఎమ్బెరుమానారే!"** అని ప్రేమతో శ్రీరామానుజులను పిలిచారు. "భగవానుడు కరుణాసముద్రుడని విన్నాము. అంతే. ఆ విషయాన్ని వీరిపట్ల ఇపుడు సాక్షాత్తుగా దర్శించగలిగాము. కనుక ఈబిరుదు వీరికి చాలా యుక్తం యుక్తం'' అని అందఱి ముందు శ్లాఘిస్తూ పలికారు.

మనకు అందఱికీ నాథులు- అనే అర్థాన్ని ఇచ్చే **"ఎమ్బెరుమానార్"** అనే నామం శ్రీరామానుజులకు మాత్రమే తగినది. కరుణాతిశయాన్ని కలవారే నాథులుగా ఉండదగినవారు కనుక, ఆ పరమకరుణ శ్రీరామానుజులలోనే ఉన్నదని అందఱూ ప్రత్యక్షంగా దర్శించారు కనుక, ఈ పేరు వారి విషయంలో అన్వర్థం.



## కూరేశులకు, దాశరథికి సంబంధించిన వృత్తాంతాలు

శ్రీరామానుజులు తిరుక్కోట్టియూర్ నమ్బివద్ద చరమశ్లోకార్థాన్ని విన్నపుడు తమకు కూరేశులు పవిత్రస్థానీయులు - అని, దాశరథి త్రిదండం - అని పేర్కొన్న విషయం తెలిసినదే. గురుపరంపరాప్రభావమనే సాంప్రదాయికచరిత్ర గ్రంథంలో కొంచెం మార్పుతో ఈ ఐతిహ్యం కన్పడుతున్నది. ఆ గ్రంథంలో తెలుపబడ్డ వివరం ఇపుడు ప్రస్తావింపబడుతున్నది.

శ్రీరామానుజులు కూరేశులను, దాశరథిని తమకు పవిత్రం, దండంగా భావించి తమ వెంట తీసికొని తిరుక్కోట్టియూర్ నంబి దగ్గరకు వెళ్ళారు. అపుడు నంబివారి ముగ్గురికి తిరుమంత్రార్థాన్ని ఉపదేశించారు. పరమగుహ్యం అయిన చరమశ్లోకార్థాన్ని శ్రీరామానుజులకు మాత్రమే ఉపదేశించాలని భావించి, "శ్రీరామానుజా! మీకు ఇంకా చరమశ్లోకార్థవిశేషాన్ని తెలుపాలని అనుకుంటున్నాను. ఇపుడు మీరు శ్రీరంగానికి వెళ్ళి, తరువాత ఏకాంతంగా మీరొక్కరే రండి'' అని అన్నారు. అదే విధంగా శ్రీరామానుజులు శ్రీరంగానికి తిరిగి వెళ్ళి, కొంతకాలం అయిన తరువాత మళ్ళీ తిరుక్కోట్టియూర్‌నంబి దగ్గరకు వెళ్ళారు. తనకు నమస్కరించి నిలచిన శ్రీరామానుజులను చూచి తిరుక్కోట్టియూర్‌నమ్బి వారి చేతిని పట్టుకొని తీసికొనిపోయారు. ఒక ఏకాంతస్థలంలో తలుపులు మూసి, కూర్చుండబెట్టి, తాము చెప్పబోయే రహస్యార్థాన్ని మఱిఎవర్వికీ చెప్పనని వారిచే తన పాదాల సాక్షిగా శపథం చేయించుకొని, చరమశ్లోకరహస్యార్థాలను వారికి ఉపదేశించారు. **"ఇదం తే నా తపస్కాయ నా భక్తాయ కదాచన, న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి'** (దీనిని తపస్సు చేయనివానికి గాని, భక్తుడు కానివానికి గాని, శుశ్రూషను లేనివానికి గాని ఉపదేశించకూడదు. నన్ను గూర్చి అసూయపడేవానికి అయితే ఎంత మాత్రం చెప్పకూడదు) అనే రీతిలో అధికారం లేనివారికి చెప్పవద్దని మళ్ళీ మళ్ళీ హెచ్చరించారు. అపుడు శ్రీరామానుజులు కూడా "స్వామీ! అటువంటి అధికారం లేనివారికి ఉపదేశించను. కాని, కూరేశులవంటి శ్రద్ధాళువులకు చెప్పకుండా ఉండలేనుకదా! ఏం చేయను?'' అని అన్నారు. తిరుక్కోట్టియూర్‌నమ్బి - "అయితే వారు ఒక సంవత్సరకాలంపాటు శుశ్రూషను చేసేటట్లుగా నియమించి, ఆ తరువాత వారికి ఉపదేశించండి'' అని ఆజ్ఞాపించారు. తరువాత శ్రీరామానుజులు నంబి అనుజ్ఞను తీసికొని శ్రీరంగానికి

తిరిగి వచ్చారు. “కూరేశులు వారి పాదాలకు నమస్కరించి నిలువగా శ్రీరామానుజులు “కూరేశా! రండి. తిరుక్కోట్టియూర్ నమ్బి చరమశ్లోకంలోని రహస్యార్థాలను ఉపదేశించారు. వాటిని ఎవరికీ చెప్పవద్దని ఆజ్ఞాపించినపుడు కూరేశులకు మాత్రం చెప్పకుండా ఉండలేనని విన్నపించాను. కూరేశులకు ఈ రహస్యార్థాలను వినే అధికారం ఉన్నా, పలువిధాలుగా వారి అధ్యవసాయాన్ని, శ్రద్ధను గమనించి, ఒక సంవత్సరకాలం పాటు శుశ్రూషను చేసిన తరువాత ఉపదేశించండి - అని నమ్బి అన్నారు” అని అన్నారు. అపుడు కూరేశులు **“మిన్నిన్ నిలైయిల మన్నుయిర్ ఆక్కైకళ్”** (మెఱుపువలె క్షణభంగురాలు ఈ శరీరాలు) అనే పాశురాన్ని మనస్సులో భావించి, ఒక సంవత్సరకాలం ఈ శరీరం నిలచి ఉంటుందో! ఉండదో! అని వ్యాకులం చెంది, ఆలోచించి, ఈ అర్థవిశేషాలను వింటే తప్ప, నిలువలేని ఆర్తివల్ల, ఆచార్యుల ఇంటివాకిటిలో ఒక మాసంకాలం ఉపవాసం ఉండడం సంవత్సరం శుశ్రూషతో సమానం - అని శాస్త్రం చెబుతున్నదని తెలిసి, అదే రీతిలో ఒకనెలపాటు ఉపవాసం ఆచరించి, శ్రీరామానుజుల వల్ల చరమశ్లోకార్థ రహస్యాలను అధికరించారు. ఆ అర్థాలను ఉపదేశించమని తరువాత ముదలియాణ్డాన్‌కూడా వచ్చి, శ్రీరామానుజులను ప్రార్థించగా, “నేను కూరేశులకు ఒక్కరికే ఈ రహస్యార్థాలను ఉపదేశిస్తానని తిరుక్కోట్టియూర్ నంబితో చెప్పి, అందుకు వారి అనుజ్ఞను పొంది వచ్చాను. మీరు నంబిగారి దగ్గరకే వెళ్ళి ఆ రహస్యార్థాలను వినండి” అని శ్రీరామానుజులన్నారు. దాశరథి అదే విధంగా తిరుక్కోట్టియూర్‌కు వెళ్ళి, నంబిగారివద్ద ఆఱు నెలల లోటు వేచి ఉన్నారు. అయినా, నంబి ఆ రహస్యార్థాలను వారికి ఉపదేశించలేదు. ఒకనాడు దాశరథి తిరుక్కచ్చినంబిగారిని చాలా గట్టిగా ప్రార్థించగా- **“ముక్కుఱుమ్బుమ్ పోనాల్ ఎమ్బెరుమానార్ తామే ప్రసాదిప్పర్; పోయ్ కొళ్ళుమ్”** (విద్యా-ధన-అభిజన మదాలనే మూడు గర్వాలు నశిస్తే శ్రీరామానుజులు స్వయంగా తామే ప్రసాదిస్తారు. వెళ్ళి గ్రహించండి) అని అనుజ్ఞను ఇచ్చి వారిని పంపించి వేశారు. దాశరథికూడా గొప్ప ఆర్తితో ఉడైయవర్ శ్రీపాదాలలో నమస్కరించి, ప్రార్థించగా, చాలా ఆదరంతో శ్రీరామానుజులు చరమశ్లోక రహస్యార్థాలను వారికి ఉపదేశించారు.

## తిరుమాలైయాణ్డాన్ సన్నిధిలో తిరువాయ్మొழி కాలక్షేపం

కొంతకాలం అయిన తరువాత, తిరుక్కోట్టియూర్ నంబి శ్రీరంగానికి వచ్చి, తమ సబ్రహ్మచారి అయిన తిరుమాలైయాణ్డాన్‌ను శ్రీరామానుజుల దగ్గరకు తీసికొని వచ్చి, వారివద్దనే ఉండమని కోరారు. తిరుమాలైయాణ్డాన్ సన్నిధిలో తిరువాయ్మొழி కాలక్షేపాన్ని ఆలకించవలసినదిగా కూడా తిరుక్కోట్టియూర్ నమ్బి శ్రీరామానుజులను ఆజ్ఞాపించారు. ఆ తరువాత తాము తిరుక్కోట్టియూర్‌కు తిరిగి వెళ్ళిపోయారు. అప్పటినుండి తిరువాయ్మొழி అర్థాన్ని శ్రీరామానుజులు తిరుమాలైయాణ్డాన్‌వద్ద వినడం ఆరంభించారు. ఆణ్డాన్ తాము ఆళవన్దార్‌ద్వారా తెలిసికొన్న అర్థాలను వివరిస్తూ ప్రవచనాన్ని చేయసాగారు. అయితే, శ్రీరామానుజులు కొన్ని సందర్భాలలో కొన్ని అర్థవిశేషాలను, యోజనాభేదాలను తెలుపుతున్నపుడు, తిరుమాలైయాణ్డాన్‌కు చాలా అతృప్తి, ఆగ్రహం కలిగింది. “వీరు విశ్వామిత్రసృష్టివలె ఇష్టం వచ్చినట్లుగా ఏదో కొత్త అర్థాన్ని చెబుతున్నారు” అనే మనస్సులోని అసంతృప్తివల్ల ఆణ్డాన్ కొంతకాలం అయిన తర్వాత తాము ప్రవచనం చేయడం నిలిపివేశారు. ఈ విషయాన్ని తిరుక్కోట్టియూర్ నంబి విన్నారు. వారు మళ్ళీ శ్రీరంగానికి వచ్చి, తిరుమాలై యాణ్డాన్ అడిగినపుడు, ఆణ్డాన్ ఆయా పాశురాల వివరణ సందర్భంలో శ్రీరామానుజులు తెల్పిన యోజనా భేదాలను, అర్థభేదాలను నంబిగారికి తెలియజేశారు. అపుడు తిరుక్కోట్టియూర్‌నమ్బి- “ఈ అర్థాలను, యోజనలను ఇదివరకే అపుడపుడు ఆళవన్దార్ చెప్పగా మేము విన్నాము. సాందీపిని మహర్షి దగ్గర శ్రీకృష్ణుడు వేదాధ్యయనం చేసినట్లేసుమా, మీవద్ద శ్రీరామానుజులు తిరువాయ్మొழி అర్థాన్ని అధికరించడం కూడా. ఆళవన్దార్ మనస్సులో ఉండే అర్థం తప్ప వీరికి ఇంకొక అర్థం ఏదీ స్ఫురించదుసుమా! వీరికి తెలియని విషయాన్ని మీరు బోధిస్తున్నానని మాత్రం మీరు భావించకండి” అని అన్నారు.

ఆ తరువాత తిరుక్కోట్టియూర్ నమ్బి, తిరుమాలై యాణ్డాన్‌ను, పెరియనంబిని తీసికొని శ్రీరామానుజులుండే మఠానికి వచ్చారు. శ్రీరామానుజులు మనస్సు వారందఱిని చూచి ఉప్పొంగింది. పెరియ నంబి, తిరుక్కోట్టియూర్ నంబి, తిరుమాలై యాణ్డాన్‌ను చూచి - “ఇంతకు ముందు నిలిపివేసిన చోటినుండి తిరువాయ్మొழி కాలక్షేపాన్ని తిరిగి ప్రారంభం చేసి, మీరే శ్రీరామానుజులను అనువర్తించి అయినా మీ ప్రవచనాన్ని పూర్తి చేయండి” అని అన్నారు. ఆనాటినుండి ఆణ్డాన్ తమ ప్రవచనాన్ని కొనసాగించి ముగించారు. “ఆళవన్దార్‌కు నేను ఏకలవ్యశిష్యుణ్ణి సుమా!” అని అపుడపుడు ఆణ్డాన్‌ను చూచి శ్రీరామానుజులు అంటూ ఉండేవారట. ఆళవన్దార్ దగ్గర తాము వినలేని అర్థాలను ఇక్కడ వినగలిగానుకదా! అని ఆణ్డాన్‌కూడా ఎంతో సంతోషించే వారు.

## శ్రీరామానుజులు మధూకరాన్ని నిలిపి వేసి, కిడాంబి ఆచ్చాన్‌ను మహానస (వంట ఇంటి) కైంకర్యంలో నియమించడం

**"తెన్నరజ్గర్ శెల్వమ్ ముఱ్ఱుమ్ తిరుత్తి వైత్తాన్ వాళ్ళియే"** (దక్షిణ దేశంలోని శ్రీరంగాలయసంపదను అంతటినీ సంస్కరించినవారు వర్ధిల్లాలి) అనే రీతిలో శ్రీరంగనాథ దివ్యాలయ సామ్రాజ్యనిర్వాహధురంధరులైన శ్రీరామానుజులు వేంచేసి ఉండే కాలంలో శ్రీరంగంలోని కైంకర్యపరులు సదాచారనిష్ఠను లేకుండా ఉండడాన్ని చూచి, శ్రీరామానుజులు వారిని సంస్కరించి, బాగు చేయాలని తలచి, వారిని కట్టడి చేశారు. వారిలో కొందఱు "వీరి కట్టుబాట్లకు లొంగి ఉండడం మనవల్ల కాదు. వీరిని మట్టుబెట్టడం మంచిది'' అని భావించారు. శ్రీరామానుజులు మఱునాడు భిక్షాటనకై వేంచేసేటపుడు విషాన్ని కలిపిన ప్రసాదాన్ని వారికి భిక్షగా పెట్టేటట్లుగా ఒకరిని నిర్బంధించి, ఆపనిని వారిచేత చేయించారు. అదే రీతిలో మఱునాడు తమకు లభించిన ప్రసాదంలోని దోషాన్ని గుర్తించి, శ్రీరామానుజులు ఆ ప్రసాదాన్ని కావేరీనీటిలో కలిపి వేశారు. ఆ నాటినుండి కొన్ని దినాలపాటు భోజనం చేయకుండా ఉపవసించారు. ఈ విషయాన్ని తిరుక్కోట్టియూర్ నంబి విని, శ్రీరంగానికి వచ్చారు. శ్రీరామానుజుల శిష్యులలో కిడామ్బి ఆచ్చాన్ అనేవారు శ్రీరామానుజుల తిరుమేని సంరక్షణ విషయంలో చాలా శ్రద్ధ కల్గినవారని గుర్తించి, వారిని వంటశాలకైంకర్యంలో నంబి నియమించారు. ఇకపై శ్రీరామానుజులు భిక్షాటనను చేయరాదని, మఠంలోనే ప్రసాదాన్ని స్వీకరించాలనికూడా కట్టడిచేసి తిరిగి వెళ్ళిపోయారు. అప్పటినుండి కిడాంబి ఆచ్చాన్ శ్రీరామానుజుల మనస్సుకు ప్రియంగా పరిచారాలను చేస్తూ సేవించారు. వేదాంతదేశికులు- **"ఎతివరనార్ మిడైప్పళ్ళి వన్ద మణ మెజ్గళ్ వార్త్తైయుమ్ మన్నియదే"** అనే పాశురంలోను, **"ఇతి యతిరాజమహానస పరిమళపరివాహవాసితామ్"** అనే శ్లోకంలోను ఈ వృత్తాంతాన్ని సూచించారు.

## యజ్ఞమూర్తిని సంస్కరించి, అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ - అనే నామాన్ని వారికి పెట్టడం

యజ్ఞమూర్తి అనే మాయావాద సన్న్యాసి భగవద్రామానుజుల వైభవాన్ని విని, వారితో వాదించి గెలవాలనే కోఱికతో శ్రీరంగంలో శ్రీరామానుజులుండే మఠానికి



వచ్చి వారిని సేవించి- "నేను అడిగే ప్రశ్నలకు అన్నిటికీ మీరు బదులివ్వాలి. మీ సమాధానం తృప్తికరంగా ఉంటే మీకు నేను శిష్యుణ్ణి కాగలను. లేకపోతే నా మతాన్ని మీరు అంగీకరించాలి'' అని అన్నాడు. శ్రీరామానుజులు అందుకు అంగీకరించారు. వారిద్దరి మధ్య పదిహేడు దినాలపాటు తీవ్రమైన వాదం జరిగింది. ఆ వాదంలో ఎవరూ గెలవలేదు. ఓడ లేదు. పదిహేడవనాడు చివరగా సమాధానం చెప్పవలసిన వంతు శ్రీరామానుజులదే అయింది. శ్రీరామానుజులకు తాను సమాధానం చెప్పవలసిన ప్రశ్నకు తగిన బదులు ఏమి? అన్నది వెంటనే స్ఫురించలేదు. వాదాన్ని మరునాడు కొనసాగించాలని పరస్పరం అంగీరించి ఆ నాటి వాదాన్ని నిలిపివేశారు. ఆనాటిరాత్రి శ్రీరామానుజుల మనస్సులో ఎంతో వ్యాకులం కల్గింది. యజ్ఞమూర్తి అడిగిన ప్రశ్నకు ఏమి చెప్పాలో తోచలేదు. తమ తిరువారాధనలోని అర్చామూర్తి అయిన వరదరాజ స్వామికి అర్ఘ్యపాద్యాలను సమర్పించి, నివేదన చేసి, ఆళ్వార్లనుండి ఆళవన్దార్‌వరకు ఎంత కాలంగానో ఏ కొఱతలేకుండా ప్రకాశించే ఈ దర్శనం ఇపుడు నావల్ల భంగాన్ని పొందనున్నదా! స్వామీ! ఈ విధంగాకూడా నీవొక లీలను చేయాలని నిశ్చయించావా!'' అని మనస్సులో తలుస్తూ, తాము భుజించకుండానే నిద్రించారు. ఆ రాత్రి వరదరాజ స్వామి కలలో కన్పించి మాయావాది నోరును మూయించే కొన్ని అర్థవిశేషాలను శ్రీరామానుజులకు స్ఫురింపజేసి అదృశ్యుడయ్యాడు. శ్రీరామానుజులు ప్రాతఃకాలంలో లేచి, ఎంతో సంతోషంతో నిత్యకర్మానుష్ఠానాలను ముగించుకొని, ప్రసన్నగంభీరంగా వాదస్థలానికి వేంచేశారు. అంతలోనే యజ్ఞమూర్తి నాకీనాడు ఓటమి తప్పదు; ఇది నిశ్చయం'' అని నిశ్చయించుకొని, అప్పటికప్పుడు లేచి శ్రీరామానుజుల శ్రీచరణాలలో వారి సాష్టాంగపడి నిలచి, "దాసుని మీ శిష్యునిగా అంగీకరించాలి'' అని చేతులను జోడించి ప్రార్థించారు. "ఇంకా చర్చ, వాదం కొనసాగవలసి ఉండగా ఇది ఏమి ?'' అని శ్రీరామానుజులు అడిగారు. అపుడు యజ్ఞమూర్తి "స్వామీ! తమకు శ్రీరంగనాథుడు ప్రత్యక్షం అయిన తరువాత మీరు వేఱు, భగవానుడు వేఱు అన్నది ఉన్నదా! ఇక ఈ దాసుడు తమ సన్నిధిలో నోఱు తెఱచి ఏమాటను చెప్పే అవకాశం లేదు. ఈ ఆత్మ(నేను) ఇంతవరకు పడిన అనర్థం చాలు. ఇంకాకూడా అనర్థపడకుండా అనుగ్రహించి, రక్షించాలి'' అని గట్టిగా ప్రార్థించారు. స్వామి అందుకు అంగీకరించారు. యజ్ఞమూర్తి అంతవరకు తాను ధరించిన ఏకదండాన్ని తీసి విసరివేసి, ప్రాయశ్చిత్తపూర్వకంగా శిఖాయజ్ఞోపవీతాలను, ప్రాయశ్చిత్తసంస్కారాలను పొంది,

త్రిదండాన్ని దాల్చి, సన్న్యాసియై, శాస్త్రానుసారం ఆచార్యుల తిరునామాన్నే కల్గి ఉండాలని కోరి ప్రార్థించగా, శ్రీరామానుజులు వారికి వరదరాజస్వామి అనుగ్రహం వల్లనే వీరిని వశం చేసికొన్నామనే ఉపకారస్మృతి లోకంలో ప్రసిద్ధం అయేటట్లుగా **"అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్"** అనే పేరును పెట్టారు. వెంటనే వారిని పిలుచుకొని పోయి, శ్రీరంగ నాథుని దర్శింపజేసి, నిర్మాల్యశఠకోపాది బహుమానాలను వారికి అనుగ్రహింపజేసి, ఆనాటినుండి తిరుప్పల్లాణ్డు మొదలైన దివ్యప్రబంధాలను నేర్పారు. రహస్యగ్రంథాలను కూడా వారికి వివరించారు.

ఆకాలంలో అనన్తాళ్వాన్ ఎచ్చాన్ తొణ్డనూర్‌నమ్బి, మరుతూర్‌నమ్బి- అనేవారు శ్రీరామానుజుల శ్రీపాదాలను ఆశ్రయించాలని రాగా, శ్రీరామానుజులు వారిని అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ శ్రీచరణాలను ఆశ్రయింపజేశారు. అపుడు అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ చాలా భయపడి, జంకుతూ అనన్తాళ్వాన్ మొదలైన వారిని చూచి "ఒక పిచ్చుకమెడలో తాటికాయను కట్టినట్లు భగవద్రామానుజులు ఈ పనిని చేసినా, మీరు శ్రీరామానుజుల శ్రీచరణాలే శరణమని భావించండి'' అని నియమించారు.

## అనన్తాళ్వాన్ తిరుమలలో శ్రీనివాసుని కైంకర్యంకోసం నియోగింపబడడం

ఒకసారి భగవద్రామానుజులు భగవద్విషయ కాలక్షేపాన్ని నిర్వహించే క్రమంలో **"ఒழுవిల్ కాలమెల్లామ్ ఉడనాయ్‌మన్ని ఒழுవిలా వడిమై శెయ్యవేణ్డుమ్ నామ్"** (విచ్ఛేదం లేని కాలం అంతా స్థిరంగా ఉండి నిరాటంకమైన, ఏలోటు లేని సర్వదేశసర్వకాల సర్వవిధ కైంకర్యాలను మేము చేయాలి) అనే దశకం ప్రస్తావనకు వచ్చింది. అపుడు కాలక్షేపగోష్ఠిలో తమ ముందున్న శిష్యులను ఉద్దేశించి శ్రీరామానుజులు- "ఆళ్వార్ శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉండే జ్యోతిస్స్వరూపుడైన పరమాత్మ సన్నిధిలో నిత్యవాసం చేస్తూ, అన్ని కైంకర్యాలను చేయాలని ఆశపడ్డారు. వారి కోరికను తీర్చేవారెవరైనా మీలో ఉన్నారా?'' అని అడిగారు. **"కుళిర్ అరువి వేఙ్గడమ్"** అన్నట్లు చల్లని సెలయేళ్ళు ప్రవహించే తిరుమలకొండ ఆ కాలంలోని విపరీతమైన చలికి ప్రసిద్ధి. అక్కడ నిత్యవాసం చేసే సాహసాన్ని ఎవరూ చేయలేనందున ఎవరూ శ్రీరామానుజులు అడిగిన ప్రశ్నకు బదులు చెప్పలేదు. ఒక్క అనన్తాళ్వాన్ మాత్రం ధైర్యంగా లేచి నిలబడి, "మీ దాసుడనైన నన్ను ఆజ్ఞాపిస్తే, నేను ఆ కైంకర్యాన్ని నిర్వహిస్తాను'' అని అన్నారు. ఆ మాటవిని చాలా సంతోషించిన శ్రీరామానుజులు "మీరొక్కరే సుమా - పురుషులు - మగవారనిపించుకున్నారు. **"నీరొరువరే ఆణ్‌పిళ్ళై"**-



అని చాలా శ్లాఘించి, వారిని తిరుమలకు పంపించారు. ఆ నాటినుండి అనన్తాళ్వాన్ వంశంవారికి **"అనన్తాణ్‌పిళ్ళై"** అనే వ్యవహారనామం ప్రసిద్ధిని పొందింది. అపుడే అనన్తాళ్వాన్ తిరుమలకు బయలుదేరి, చేరి శ్రీవేంకటేశ్వరుని సేవించి, అక్కడ ఒక చక్కని ఉద్యానవనాన్ని నిర్మించి, దానికి **"శ్రీరామానుజన్"** అనే పేరుపెట్టి, అనేక విధాలైన కైంకర్యాలను అద్భుతంగా నిర్వహించసాగారు. దానిని సాక్షాత్తుగా చూచి ఆనందించాలని అనే భావన శ్రీరామానుజులకు కల్గి తిరుమలకు యాత్రగా బయలుదేరారు.

## శ్రీరామానుజుల తిరుమల యాత్ర- తిరుమలైనంబివద్ద శ్రీరామాయణ రహస్యార్థశ్రవణం

శ్రీరామానుజులు తమ యాత్రాక్రమంలో దారిలోని దివ్యదేశాలను అన్నిటినీ సేవించి, మంగళాశాసనం చేస్తూ, తిరుమల తిరుపతిక్షేత్రాన్ని చేరారు. తిరుమలకొండ పాదప్రదేశానికి వచ్చి, ఆదిశేషుని స్వరూపంగా కీర్తింపబడే ఆ కొండపై పాదాలను మోపుతూ ఎక్కడానికి ఇష్టపడక, కిందనే ఉండి పోయారు. అపుడు అనన్తాళ్వాన్ మొదలైన వారు ఈ సంగతిని గుర్తించి వారి వద్దకు వచ్చి, "స్వామీ! మీరు ఈ విధంగా భావిస్తే, ఇక మేము అంతా తిరుమలను వదలిపెట్టి మీ పాదాల వద్దనే నిత్య నివాసం చేయవలసి వస్తుంది'' అని నివేదించారు. వారి ప్రార్థనను శ్రీరామానుజులు విని, అది శ్రీవేంకటేశ్వరుని ఆజ్ఞగా భావించి, కొండకు బయలుదేరి తిరుమలను చేరారు. స్వామిపుష్కరిణిలో స్నానమాడి, శ్రీవేంకటేశ్వరుని కళ్ళార సేవించారు. అనన్తాళ్వాన్ ఆ క్షేత్రంలో నిర్వహించే అద్భుతకైంకర్యాలను కటాక్షించి, ఎంతో ఆనందపడ్డారు. **"వళర్‌త్తదనాల్ పయన్ పెற்றేన్ వరుక"** (పెంచి పెద్ద చేసినందులకు తగిన ఫలాన్ని పొందాను. రా!) అని వారిని ప్రశంసించారు. మూడు దినాలపాటు ఏమీ ఆహారం స్వీకరించకుండానే ఉన్నారు, శ్రీవేంకటేశ్వరుని అనుజ్ఞతో కిందకు వచ్చి మేనమామగారైన తిరుమలై నమ్బి ఇంటిలో ఒక సంవత్సకాలం ఉండి, ఇతిహాసశ్రేష్ఠం అయిన శ్రీరామాయణంలోని సంప్రదాయరహస్యార్థాలను శ్రవణం చేశారు.

## శ్రీరామానుజులు గోవిందభట్టర్ (ఎమ్బార్) ను కానుకగా పొంది కంచికి చేరడం

శ్రీరామానుజులు తిరుమలైనంబివద్ద శ్రీరామాయణకాలక్షేపాన్ని (శ్రవణాన్ని) ముగించుకొని ప్రయాణమయ్యే సమయంలో తిరుమలైనంబి తమ మనస్సులో కల్గిన ఆనందాతిశయం చేత, శ్రీరామానుజులకు ఏదైనా కానుకగా ఇవ్వాలని ఆశపడ్డారు. అపుడు వారి మనస్సును తెలిసిన శ్రీరామానుజులు "దాసుడనైన నేనే వాస్తవానికి

తగిన రీతిలో మీకు ఏదైనా బహుమానంగా సమర్పించవలసి ఉండగా, మీరే నాకు ఏమయినా అనుగ్రహిస్తానని అంటున్నారు. ఈ విధంగా మీరు నన్ను అనుగ్రహించాలని భావిస్తే, మన గోవిందభట్టర్‌ను మాకు కానుకగా అనుగ్రహించండి” అని విన్నపించారు. తిరుమలై నంబి దానిని అంగీకరించి వెంటనే గోవిందభట్టర్‌ను పిలిచి, “గోవిందా ! ఇక మీరు మన శ్రీరామానుజులను అనువర్తిస్తూ, వారి ఆజ్ఞానుసారం నడచుకొనండి” అని ఆజ్ఞాపించారు. వారిని శ్రీరామానుజులకు అప్పగించారు. చాలా సంతోషంతో శ్రీరామానుజులు వారిని స్వీకరించి, ఘటికాద్రిమొదలైన దివ్యదేశాలను సందర్శించి, అక్కడి అర్చామూర్తులకు మంగళాశాసనం చేస్తూ, క్రమంగా కంచిలోని వరదరాజస్వామి సన్నిధిని చేరారు.

## గోవిందభట్టర్ తిరుపతికి తిరిగి వెళ్ళడం

శ్రీరామానుజులు గోవిందభట్టర్‌తో కలసి కంచిలో ఉన్నపుడు తమ ఆచార్యులైన తిరుమలైనంబిని విడిచి ఉన్న క్లేశంతో గోవిందభట్టర్ చాలా చిక్కి, పాలిపోయారు. ఎమ్బార్ స్థితిని గమనించిన శ్రీరామానుజులు వారి మనస్సును గుర్తించి- “గోవింద భట్టారకా! మీరు ఒకసారి తిరుపతికి వెళ్ళి తిరుమలైనంబిని సేవించి రండి’ అని వారికి ఇద్దఱు శ్రీవైష్ణవులను తోడిచ్చి పంపారు. తిరుపతికి చేరిన గోవిందభట్టర్ (ఎమ్బార్) అక్కడ తిరుమలైనంబి ఇంటి వాకిలిలో దండం సమర్పించి నిలచారు. అక్కడ ఉన్నవారు ఆ విషయాన్ని ఇంటి లోపల ఉండే తిరుమలై నంబికి తెలిపారు. తిరుమలైనంబి మనస్సులో చాలా బాధపడి, “ఆ పిచ్చివాణ్ణి వెళ్ళిపోమని చెప్పండి” అని చెప్పి పంపించారు. “ఇంత దూరం మీకోసం ఎంతో శ్రమపడి వచ్చినవారిని పిలిచి, సేవను, శ్రీపాదతీర్థాన్ని, ప్రసాదాన్ని అనుగ్రహించవద్దా!” అని వారి దేవేరి పల్కినా, “అమ్మిన పశువుకు ఎవరైనా గడ్డి వేస్తారా?” అని అంటూ ఆమె మాటను తిరస్కరించారు. నమ్బి పల్కిన మాటను తెలిసిన ఎమ్బార్ వారి  మనస్సును గుర్తించి, ఇక తనకు శ్రీరామానుజులే శరణ్యమని తలచి, తిరుమలై నంబి వాకిలిలో సాష్టాంగపడి, తమతో వచ్చిన ఇద్దరు శ్రీవైష్ణవులతో పాటు బయలు దేరి, కంచిలో ఉండే శ్రీరామానుజులను చేరారు. ఆ తరువాత అందఱు కలిసి శ్రీరంగాన్ని చేరారు. గోవిందభట్టర్ ఎంతో విషయవైరాగ్యాన్ని కలవారై, సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించారు. ఎమ్బెరుమానార్ల నామంలో ఏకదేశం అయిన **“ఎమ్బార్”** అనే తిరునామాన్ని పొంది, ఉభయవేదాంత గ్రంథపరిశ్రమలో నిష్ణాతులయ్యారు.



## శ్రీరామానుజుల శ్రీభాష్యగ్రంథరచన

భగవద్రామానుజులు బ్రహ్మసూత్రాలకు శ్రీభాష్యాన్ని రచించి, శ్రీయామునుల కోఱికలలో ఒక కోఱికను తీర్చదలచారు. అందుకోసం, భగవద్బోధాయన మహర్షి రచించిన వృత్తి గ్రంథాన్ని ఒక పర్యాయం పరిశీలించాలని భావించారు. ఆ గ్రంథప్రతి కాశ్మీరదేశంలోని శారదాపీఠంలో ఉన్నదని తెలిసికొని, కూరేశప్రభృతులను వెంటబెట్టుకొని బయలుదేరారు. కాశ్మీరదేశంలోని శారదాపీఠాన్ని చేరి శ్రీరామానుజులు తమ పాండిత్యప్రతిభతో అక్కడి సరస్వతీభాండారాధికారిని మెప్పించి, ఆ బోధాయన వృత్తి గ్రంథాన్ని తీసికొని, అక్కడనే ఉండి దానిని కటాక్షించాలని ప్రయత్నించారు. మహామేధావి అయిన కూరేశులుకూడా తమకు వీలయినపుడు ఆ గ్రంథాన్ని రాత్రి సమయాలలోకూడా చదివి, మొత్తం పరిశీలించారు. ఏక సంధాగ్రాహి అయిన కూరేశులు తాము చదివిన వృత్తిగ్రంథాన్ని పూర్తిగా తమ మనస్సులో పదిల పఱచుకొన్నారు. శ్రీరామానుజులు మొదటి అధ్యాయం వరకు పరిశీలించి పూర్తిచేసిన సమయానికి కాశ్మీరదేశంలో ఉండే బాహ్యమతస్థులు కొందఱు చేసిన దుర్బోధలవల్ల మనస్సు మాఱిన గ్రంథాలయాధికారి ఆ వృత్తిగ్రంథాన్ని శ్రీరామానుజులవద్ద నుండి నిర్బంధించి, తిరిగి తీసికొన్నాడు. గ్రంథాన్ని పూర్తిగా చూడలేక పోయాముకదా! అని శ్రీ రామానుజులు మనస్సులో కొఱతపడుతూ ఉండగా, కూరేశులు తాము వృత్తిగ్రంథాన్ని పూర్తిగా చదివామని, అంతా తమకు గుర్తున్నదని పలికి, శ్రీరామానుజులను ఊరడించారు. తరువాత శ్రీరంగాన్ని చేరిన శ్రీరామానుజులు కూరేశుల సహాయంతో శ్రీభాష్యాన్ని అనుగ్రహించారు. దీనికి సంగ్రహంగా వేదాంతదీపం, వేదాంతసారం - అనే ఇంకో రెండు గ్రంథాలను కూడా రచించారు.

శ్రీరామానుజులు ఒకనాడు భిక్షకోసం శ్రీరంగంలో తిరువీథులలో సంచరిస్తూ గోదాదేవి రచించిన తిరుప్పావై ప్రబంధాన్ని అనుసంధిస్తున్నారు.  వారు పెరియనంబి గృహానికి చేరి, తిరుప్పావైలోని 18వ పాశురాన్ని అనుసంధిస్తూ, **“శీరార్ వళై ఒలిప్ప వందు తిఱవాయ్”** (ఓనీళాదేవీ! మధురంగా నీ చేతిగాజులు శబ్దం చేస్తూ ఉండగా నీవు వచ్చి తలుపులు తెరవాలి.) అనే సూక్తిని మనసులో స్మరించేటప్పుడు, అదేసమయంలో పెరియ నంబిగారి కుమార్తె, గాజులు గల గల లాడగా తలుపులు తీసి భిక్షను సమర్పించాలని బయటకు వచ్చింది. ఆమెను చూసి శ్రీరామానుజులు సాక్షాత్తు నీళాదేవియే వచ్చినదని తలచి ఆనందపారవశ్యంతో మూర్ఛపోయారు.

పెరియనంబి కుమార్తె భయపడి లోపలికి పరుగెత్తిపోయి, జరిగిన సంగతిని తండ్రిగారికి నివేదించింది. నమ్బి "శ్రీరామానుజులు 18వ పాశురాన్ని అనుసంధిస్తున్నారు కదా'' అని అన్నారట. శ్రీరామానుజుల దివ్యప్రబంధానుభవం, భక్తిపారవశ్యం అంత గొప్పది.

గోదాదేవి నాచ్చియార్‌తిరుమొழி అనే ప్రబంధంలో ఒకచోట - నూరు గంగాళాల వెన్నను, నూరు గంగాళాల పాయసాన్ని తిరుమాలిరుమ్‌శోలై అనే క్షేత్రంలోని సుందర బాహుస్వామికి సమర్పిస్తానని అన్నది. కానీ ఆమె ఆవిధంగా సమర్పించలేకపోయింది. శ్రీరామానుజులు గోదాదేవి పల్కిన ఈ సూక్తిని ఒకనాడు స్మరించి, గోదాదేవి ఆశపడిన కైంకర్యాన్ని తాము నిర్వహించి, ఆమె మనోరథాన్ని పూర్తిచేయాలని తలచారు. ఆ విధంగానే తిరుమాలిరుమ్‌శోలై క్షేత్రాన్ని చేరి సుందరబాహు స్వామికి నూరు గంగాళాల వెన్నను, నూరు గంగాళాల పాయసాన్ని సమర్పించారు. ఈ విషయాన్ని తెలిసిన గోదాదేవి చాలా ఆనందించి, శ్రీరామానుజులు శ్రీవిల్లిపుత్తూర్ క్షేత్రంలో తనను దర్శించ డానికి వచ్చినప్పుడు వారిని "అణ్ణా!'' అని ఆదరంగా సంబోధించింది. అందువల్లనే శ్రీరామానుజులకు గోదాగ్రజులు అనే పేరు వచ్చింది.

## చోళరాజువల్ల కల్గిన ఉపద్రవం, రామానుజులు మేల్కోటైకు వేంచేయడం

కూరేశుల సహాయంతో శ్రీరామానుజులు విశిష్టాద్వైతదర్శననిర్వాహాన్ని చేసే కాలంలో, రాజేంద్రచోళపురంలో రాజ్యపాలన సాగించే కులోత్తుంగచోళుడు మితి మీరిన వైష్ణవద్వేషాన్ని, అంతు లేని శైవదురభిమానాన్ని కలవాడు కావడంవల్ల, తన దేశంలో ఉండే అందఱిని శైవులుగా మార్చాలనే తీవ్రమైన పట్టుదలతో ఉండేవాడు. తాను, తన పురోహితుడు కలసి దేశంలోని విద్వాంసులను అందఱినీ పిలిచి, **"శివాత్ పరతరం నాస్తి"** అని వ్రాసి సంతకం పెట్టమని వారిని నిర్బంధించడం ప్రారంభించారు. కొందఱు అతని దౌష్ట్యానికి భయపడి, మఱి కొందరు ధనలోభానికి ఆశపడి అతడు చెప్పినట్లే చేశారు. అపుడు ఆ ప్రభువు వద్ద మాట పలుకుబడిని కల నాలూరాన్ అనే వైష్ణవుడు అతనితో "వీరంతా సంతకం చేస్తే ఏమయింది? శ్రీరామానుజులచేత అంగీకరింప జేసినపుడే నీవు అనుకొన్న పని పూర్తి అవుతుంది.'' అని అన్నాడు. ఈ దుర్బోధవల్ల చోళరాజు తన భటులను శ్రీరంగానికి వెళ్ళి శ్రీరామానుజులను వెంటనే తన వద్దకు తీసికొనిరమ్మని ఆజ్ఞాపించాడు. రాజాజ్ఞను అనుసరించి భటులు, శ్రీరంగంలోని శ్రీరామానుజుల మఠాన్ని చేరి, వారికోసం విచారించారు. ఈ సంగతిని కూరేశులు



గుర్తించి, జరుగబోయే ప్రమాదాన్ని ముందుగానే పసికట్టారు. "శ్రీరామానుజులు చోళరాజు సభకు వెళ్ళడం జరిగితే వారికి అక్కడ ఏదైనా అనర్థం జరుగవచ్చు. లోకానికి అంతటికీ ప్రాణస్థానీయులైన వారిని కోల్పోరాదు. నేనే వారి వేషాన్ని ధరించి సభకు వెళ్ళగలను. కీడు ఏదైనా సంభవించినా అది నాకే జరుగనీ'' అని తలచి, ఆ సమయంలో శ్రీరామానుజులు కావేరీనదికి స్నానంకోసం పోయిన సంగతిని గమనించి, వారి కాషాయాన్ని, త్రిదండాన్ని తామే ధరించి, వచ్చిన రాజభటులకు తామే శ్రీరామానుజుల మని తెలియజేసి వారితో రాజసభకు బయలుదేరారు. అపుడు వీరితో పాటుగా పెరియనంబి, మఱికొందరు శిష్యులు వెంటగా వెళ్ళారు. వీరు అందఱితోపాటు కూరేశులు చోళరాజు సభను చేరారు. స్నానం చేయడంకోసం కావేరీనదికి వెళ్ళిన శ్రీరామానుజులు తమ మఠానికి తిరిగి వచ్చి, త్రిదండకాషాయాదులకోసం వెదికారు. అపుడు మఠంలో ఉన్న ముదలియాణ్డాన్ "కూరేశులు మీ త్రిదండ కాషాయాలను ధరించి, రాజభటులతో కలిసి రాజసభకు వెళ్ళారు'' అని తెలియజేశారు. జరిగిన విషయాన్ని అంతటినీ అర్థం చేసికొన్న శ్రీరామానుజులు కూరేశుల ధరించే శ్వేతవస్త్రాలను తాము ధరించారు. కూరేశులకు, పెరియ నంబికి రాజసభలో ఏమి అపాయం సంభవిస్తుందో! ఏమో! అని భయపడ్డారు. అపుడు పలువురు ఇక శ్రీరామానుజులు శ్రీరంగంలో ఉండడం ఎంతమాత్రం క్షేమకరం కాదని, వెంటనే అక్కడినుండి ఎక్కడికైనా సురక్షితప్రాంతానికి వెళ్ళిపోవడం మంచిది - అని పదే పదే విజ్ఞాపన చేశారు. ఇక, వేఱే దారి ఏమీ లేని శ్రీరామానుజులు తమతోపాటు కొంతమంది శిష్యులను, ముదలి యాణ్డాన్‌ను వెంటబెట్టుకొని పడమటి దిశగా ప్రయాణం చేసి, తిరునారాయణపురాన్ని చేరారు.

## చోళరాజు సభలో జరిగిన వృత్తాంతం

కూరేశులు, పెరియనంబి చోళరాజు సభలో ప్రవేశించిన తరువాత, అక్కడ విశేషమైన శాస్త్రచర్చ జరిగింది. **"శివాత్ పరతరం నాస్తి"** అనే రాజు పల్కిన వాక్యాన్ని తిరస్కరిస్తూ కూరేశులు పరస్సహస్రప్రమాణాలను వేదవేదాంగస్మృతీతిహాస పురాణాలనుండి, దివ్యసూరుల ప్రబంధాలనుండి ఎత్తిచూపి, వాదించి, విష్ణువే పరతత్త్వమని సిద్ధాంతీకరించారు. చోళరాజు సమాధానం ఏమీ చెప్ప లేని స్థితిలో **"శేషం కోపేన పూరయేత్"** అనే రీతిలో క్రుద్ధుడై, కూరేశులు, పెరినంబి ఇరువురి నేత్రాలను పెకలించవలసినదిగా భటులను ఆజ్ఞాపించాడు. కూరేశులు చోళుని చూచి - "నీవు

మహాపాతకివి. నిన్ను చూచిన కళ్ళు ఇక నాకు వద్దు'' అని అంటూ తామే స్వయంగా తమ గోళ్ళతో కళ్ళను పెకలించుకొన్నారు. రాజసేవకులు పెరియనంబి నేత్రాలను తీసివేశారు. రాజాజ్ఞను పాలిస్తూ సేవకులు పెరియనంబిని, కూరేశులను రాజభవన ద్వారం బయటకు తీసికొనిపోయి విడచిపెట్టారు. కూరేశులు దర్శనం కోసం తమ దర్శనాలను రెండిటిని త్యాగం చేయగలిగానుకదా! అనే తృప్తిని తమ మనస్సులో పొందారు. తరువాత ఇరువురు శ్రీరంగంవైపు ప్రయాణాన్ని సాగించారు. పెరియనంబి మాత్రం వృద్ధులు కావడంవల్ల నేత్రాలను పెకలించినందున కల్గిన బాధను భరించలేక పోయారు. మార్గమధ్యంలో కూరేశుల ఒడిలో తలను, తమ కుమార్తె అత్తుళ్లాయమ్మ ఒడిలో పాదాలను పెట్టుకొని, శ్రీయామునుల శ్రీపాదాలను ధ్యానిస్తూ అక్కడే పరమపదాన్ని చేరారు. తరువాత శ్రీపరాతంక పురమనే అగ్రహారంనుండి వచ్చిన శ్రీవైష్ణవులు పెరియనంబికి చరమసంస్కారాలను పూర్తి చేసి, కూరేశులను తమ వెంట తీసికొనిపోయి తాముండే అగ్రహారంలో కొన్ని దినాలపాటు పెట్టుకొని, నేత్రబాధ ఉపశమించేటట్లు చికిత్స చేయించారు. ఆ తరువాత వారిని శ్రీరంగానికి తీసికొని పోయి విడచిపెట్టారు. శ్రీరామానుజులు విడచిపెట్టిన శ్రీరంగంలో నివసించలేని కూరేశులు అక్కడనుండి బయలుదేరి తిరుమాలిరుమ్‌శోలై అనే దివ్యదేశం చేరి, అక్కడ కొంతకాలం నివసించారు. ఆ ప్రయాణంలో దారిలో తమకు నేత్రబాధ స్ఫురించకుండా ఉండేటట్లుగా వైకుంఠనాథుని స్వరూపరూప గుణవిభూతులను మనస్సులో ధ్యానిస్తూ, ఆ అనుభవ పరీవాహరూపంగా శ్రీవైకుంఠస్తవాన్ని, విభవావతార లీలలను కీర్తిస్తూ అతిమానుషస్తవాన్ని రచించారు. తిరుమాలిరుమ్ శోలైకు చేరిన తరువాత అక్కడ వేంచేసి ఉండే అర్చామూర్తి అయిన సుందరబాహు స్వామినిగూర్చి సుందరబాహుస్తవంలో స్తుతించారు. కొన్ని సంవత్సరాలు గడచిన తర్వాత మహాపాతకి అయిన చోళరాజు కంఠంలో ఏర్పడిన పుండువల్ల చనిపోయాడని తెలిసి, తిరుమాలిరుమ్‌శోలై నుండి బయలుదేరి మళ్ళీ శ్రీరంగాన్ని చేరారు.

## భగవద్రామానుజులు - తిరునారాయణపురం (మేల్కోటె)

చోళరాజువల్ల కల్గిన ఉపద్రవం కారణంగా భగవద్రామా నుజులు కర్ణాటక దేశం మేల్కోటె ప్రాంతం సాలగ్రామాన్ని చేరి, అపుడు ఆ ప్రాంతాన్ని పాలించే విష్ణువర్ధనుడనే ప్రభువు ఆదరణను పొంది, అతని సహాయంతో తిరునారాయణ పురంలోని కోవెలలో అర్చామూర్తిని పునః ప్రతిష్ఠించారు. ఈ వృత్తాంతాన్నిగూర్చి



ప్రస్తావించిన ఆధారాలలో మిక్కిలి ప్రాచీనమైనది గురుపరంపరా ప్రభావమనే సంప్రదాయ చారిత్రక గ్రంథం. 13వ శతాబ్దంలో ఇది రచింపబడింది. 12వ శతాబ్దానికి చెందిన సాలగ్రామంలో దొరికిన శాసనంలో శ్రీరామానుజుల శిష్యుల ముగ్గురి పేర్లు ప్రస్తావించబడ్డాయి. ఈ పేర్లు గురుపరంపరాప్రభావంలో కూడ కన్పిస్తున్నాయి. ఇంతేకాక, 13వ శతాబ్ది చివరి భాగానికి చెందిన మేల్కోటెలో దొరికిన శాసనంలో భగవద్రామానుజులు శ్వేతమృత్తికను (తిరుమణ్‌ను) వెదకి సంపాదించిన వృత్తాంతం కన్పిస్తున్నది. ఈవృత్తాంతప్రస్తావన కూడా గురుపరంపరాప్రభావమనే సాంప్రదాయిక చరిత్రగ్రంథంలో ఉన్నది. ఇవి అన్నీ మేల్కోటె ప్రాంతంలో భగవద్రామానుజుల నివాసాన్ని సమర్థిస్తున్నాయి. క్రీ.శ. 1544 సంలోని ఒక శాసనంకూడా భగవద్రామానుజులు మేల్కోటెలోని యతిరాజమఠంలో నివసించినట్లు తెల్పుతున్నది.

శ్రీరామానుజులు మేల్కోటెలో నివసించిన కాలాన్నిగూర్చి చారిత్రక పరిశోధకులలో కొంత అభిప్రాయభేదం కన్పిస్తుంది. ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ మొదలైనవారు 11వ శతాబ్ది చివరి భాగంలో శ్రీరామానుజులు మేల్కోటె ప్రాంతంలో నివసించినట్లు అభిప్రాయపడ్డారు. ఎ.ఎన్. కృష్ణ అయ్యంగార్ అభిప్రాయానుసారం ఈ సంఘటన 12వ శతాబ్దం ఆరంభంలో జరిగింది. మొదట సాలగ్రామంలో, ఆ తరువాత తొండనూర్‌లో నివసించిన శ్రీరామానుజులు తరువాత విష్ణువర్ధనుని సహాయంతో మేల్కోటెలో స్థిరపడ్డారు.

"క్రీ.శ. 1125 వ సంగలో, 1128 వ సంగలో వ్రాయబడ్డ రెండు శాసనాలను బట్టి క్రీ.శ. 1125-1128 సంగల మధ్యభాగంలో తొండనూర్ విష్ణువర్ధనుని రాజధానిగా వెలసిందని తెలుస్తున్నది. ఈ మధ్యకాలంలోనే భగవద్రామానుజులు తొండనూర్ నంబిద్వారా విష్ణువర్ధనుని కలిసి ఉండవచ్చు. విష్ణువర్ధనుడు రాజకీయంగా స్థైర్యాన్ని క్రీ.శ. 1117 వ సంలో పొందాడు. అందువల్ల మేల్కోటె ఆలయంలో తిరునారాయణమూర్తి అర్చామూర్తి పునఃప్రతిష్ఠ క్రీ.శ. 1117-1128 సంల మధ్య భాగంలో జరిగి ఉండవచ్చు''- అనే అభిప్రాయాన్ని శ్రీమతి ఆర్. వసంత "Melkote Throuugh The Ages" అనే వ్యాససంకలనాత్మక గ్రంథంలోని "A Study in Historical Perspective" అనే వ్యాసంలో వ్యక్తం చేశారు.

కాని, శ్రీవైష్ణవ శ్రీ శ్రీమాన్ ఎ. కృష్ణమాచార్యస్వామివారు "Ramanuja- a reality not a myth" అనే ఆంగ్లగ్రంథంలో ఈ విధంగా అభిప్రాయపడ్డారు.

"శ్రీరామానుజులు క్రీ.శ. 107 సం॥ ప్రాంతంలో తొండనూర్‌ను చేరారు. అక్కడ తొండనూర్‌నంబిని కలిసి, వారి సహకారంతో విష్ణువర్ధనుని శ్రీవైష్ణవునిగా సంస్కరించారు. 1078 సం ప్రాంతంలో కృమికంఠుడు మరణించిన తరువాత చోళరాజ్యంలో రాజకీయస్థైర్యం నెలకొన్నది. అపుడు శ్రీరామానుజులు శ్రీరంగానికి తిరిగి వచ్చారు. విష్ణువర్ధనుడు హోయసల రాజ్యాధిపతి అయిన తరువాత క్రీ.శ. 1097-98 సం ప్రాంతంలో అతడు శ్రీరామానుజులను శ్రీరంగానికి వెళ్ళి తిరునారాయణపురంలోని ఆలయ ప్రతిష్ఠాదుల నిర్వహణకోసం ఆహ్వానించగా, శ్రీరామానుజులు వచ్చి క్రీ.శ.1099 వ సంలో ఆ కార్యక్రమాన్ని నిర్వహించారు. మళ్ళీ తిరిగి క్రీ.శ. 1117సం లో ఆ ప్రభువు ప్రార్థన మేరకు కర్ణాటక దేశానికి పోయి బేలూర్‌లోని ఆలయంయొక్క ప్రతిష్ఠాకార్యక్రమాన్ని నిర్వహించారు."

ఈ అభిప్రాయం మిక్కిలి సహేతుకంగా, అంగీకార్యంగా కన్పిస్తుంది. గురుపరంపరాప్రభావం, ప్రపన్నామృతం మొదలైన గ్రంథాలలో తిరునారాయణ పురంలోని ఆలయం పునఃప్రతిష్ఠ బహుధాన్య సంవత్సరం తైమాసం (పుష్య మాసం)లో జరిగినట్లు తెలుపబడింది. అందువల్ల లభించే పలు ఆధారాలనుబట్టి తిరునారాయణపురంలోని ఆలయపునరుద్ధరణ క్రీ.శ. 1099 సం॥లో జరిగిందని భావించడంలోనే ఎక్కువ ఔచిత్యం ఉన్నది. అప్పటికి శ్రీరామానుజుల వయస్సు సుమారు 82 సంలు. ఆ తరువాత సుమారు 38 సం ల పాటు శ్రీరామానుజులు జీవించి ఉన్నారు. కనుక, శ్రీరంగానికి శ్రీరామానుజులు తిరిగి వచ్చిన తరువాత సంభవించినట్లు వారి చరిత్రలో చెప్పబడే పలు సంఘటనలకు కూడా ఈ కాలవ్యవధి అవకాశం ఇస్తున్నది.

## గురుపరంపరాప్రభావంలోని తిరునారాయణపురం కోవెల పునరుద్ధరణ వృత్తాంతం

తొండనూర్‌లో శ్రీరామానుజులు వేంచేసి ఉండే సమయంలో, ఒకనాడు ఆ ఆచార్యులు తాము నిత్యం ధరించే శ్వేతమృత్తికను (తిరుమణ్) సంపాదించడం కోసం ఎంతగా అన్వేషించినా దొరకనందున "అయ్యో ! ధరించడానికి తిరుమణ్ (శ్వేతమృత్తిక) దొరకలేదే !" అని విచారిస్తూ నిద్రించారు. ఆనాటి రాత్రి తిరునారాయణమూర్తి- "సమీపంలోనే యదుగిరిలో మీ రాకను ఎదురు చూస్తూ ఉన్నాము. మీ మనస్సువంటి (తెల్లని) మన్ను ఇక్కడ ఉన్నది. శీఘ్రంగా బయలు దేరండి" అని స్వప్నంలో పలికాడు. శ్రీరామానుజులు తెల్లవారగానే సంతోషంతో నిదుర లేచి, ఆ సంగతిని తమ శిష్యులకు తెల్పి, విష్ణువర్ధనుని పిలిపించారు తమ స్వప్నవృత్తాంతాన్ని అతనికి తెలియజేశారు. అతడు దానిని విని చాలా సంతోషించి, సేవకులద్వారా అరణ్యప్రాంతాన్ని ఛేదింపజేస్తూ శ్రీరామానుజులను వెంబడించాడు. బహుధాన్య సంవత్సరం తైమాసంలో (1099 ఫిబ్రవరి -మార్చినెలలో) భగవద్రామా నుజులు యదుగిరిని ఎక్కి, వేదపుష్కరిణీ సరస్తీరంలో **"పరిధానశిలాం దృష్ట్వా ప్రణమంతి ద్విజోత్తమాః"** (పరిధానశిలను దర్శించి బ్రాహ్మణోత్తములు దానికి నమస్కరిస్తారు) అనే రీతిలో పరిధానశిలను దర్శించి, అక్కడ స్నానం చేసి, **"వేదపుష్కరిణీతీరే విశాలే చ శిలాతలే, పరిధానం స జగ్రాహ కాషాయం పరమః పుమాన్"** అనే దత్తాత్రేయునివలె తాముకూడా మళ్ళీ కాషాయాన్ని ధరించి, ముందుకు సాగారు. తిరునారాయణ స్వామి వేంచేసి ఉండే చోటును అక్కడ ఎంత వెదకినా వారు కానలేక "భగవదనుగ్రహం లేనపుడు ఏమి చేయగలం ?" అని విచారించి అలసటచెంది అక్కడే నిద్రించారు. అపుడు తిరునారాయణ పురస్వామి వీరికి మళ్ళీ కలలో సాక్షాత్కరించి, "కల్యాణసరస్సుకు దక్షిణ దిశ మూలలో గల సంపెంగ తోటలో ఉండే వకుళ (పొగడ) వృక్షానికి దక్షిణంగా తులసీ వృక్షానికి కింద పుట్టలో ఉన్నాను. శ్వేతమృత్తికకూడా కల్యాణసరస్సుకు ఉత్తరంగా గల పర్వతం మూలలో **"శ్వేతద్వీపాత్ ఖగేశేన శుద్ధమృద్ద్రవ్యమాహృతమ్, యాదవాద్రౌ వినిక్షిప్త మక్షయం తన్మదాజ్ఞయా"** (శ్వేతద్వీపంనుండి గరుడునిచే శ్వేతమృత్తిక తీసికొని రాబడి, యాదవగిరిపై ఉంచబడింది. అది నా ఆజ్ఞవల్ల అక్షయంగా ఉన్నది) అనే క్రమంలో శ్వేతమృత్తిక గరుడునిచే శ్వేతద్వీపంనుండి తీసికొనివచ్చి యదుగిరిపై నిక్షిప్తం చేయబడింది. నా మహిమవల్ల అది అక్షయంగా వృద్ధి చెందుతున్నది. మీరెందుకు విచారిస్తారు? మేము మీకు గుర్తుగా ఈ చోటు నుండి మేము ఉండే పుట్టవరకు కోయబడిన తులసి చిగుళ్ళనే గుర్తుగా చేసికొని రండి" అని ప్రత్యక్ష సమానాకారంగా స్వప్నంలో పలికాడు. శ్రీరామానుజులు నిద్ర లేచి సంతోషించి, ఆ విధంగానే కోయబడ్డ తులసి చిగుళ్ళను ఆధారంగా చేసికొని

కల్యాణసరస్తీరాన్ని చేరారు. భగవానుడు పల్కినట్లుగా సంపెంగవనసమీపంలో మిక్కిలి విస్తృతంగా పెరిగి విస్తరించిన తులసీ వృక్షాన్ని చూచి ఆనందించి, పలు మార్లు దానికి నమస్కరించారు. ఆ తులసీవృక్షం మూలలోని మట్టిని తొలగించగానే **"కమపి యదుగిరిస్థం కాంతిసింధుం దదర్శ"** (అనిర్వచనీయమైన, యదుశైలంలో ఉండే కాంతి సముద్రాన్ని దర్శించారు) అనే రీతిలో పుట్టలోపల బంగారువిమానం కన్పించింది. తరువాత, అందులో వేంచేసి ఉండే నీలవర్ణంలోని భగవానుని మూర్తి సాక్షాత్కరించింది. శకవర్షం ఒకవేయి ఇరవై (1012) సంవత్సరాలు గడిచిన తరువాత బహుధాన్యసంవత్సరం తైనెల (పుష్యమాసం) శుక్లపక్షంలోని చతుర్దశి తిథి గురువారంతో కూడిన పునర్వసు నక్షత్రంలో (క్రీ.శ. 1099 సం॥లో) తిరునారాయణుని రూపాన్ని దర్శించి శ్రీరామానుజులు చాలా ఆనందించారు. అందఱు ససంభ్రమనృత్యాన్ని చేశారు. శ్రీరామానుజులు శంఖమృదంగ పటహాది సకల మంగళవాద్యాలను మోగింపజేస్తూ, ప్రభువును పిలిచి, ఆ మూర్తిని చూపించి, క్షీరాభిషేకాన్ని చేశారు. **"పకల్ కణ్డేన్ నారణనై క్కణ్డేన్ కనవిల్ మిక క్కణ్డేన్ మీణ్డవనై మెయ్యే మిక క్కణ్డేన్"** (పగలును చూచాను, నారాయణుని దర్శించాను. స్వప్నంలో చక్కగా దర్శించాను. తిరిగి అతనిని సాక్షాత్తుగా చక్కగా దర్శించాను) అనే రీతిలో తిరునారాయణస్వామిని శ్రీచరణాలనుండి కిరీటపర్యంతం కన్నులార దర్శించి ఆనందించి, తమ శ్రీహస్తాలతో మూడు దినాలు తిరువారాధనను చేశారు.

### ఉత్సవమూర్తి లభ్యం కావడం

తరువాత, కల్యాణసరస్సుకు ఉత్తర దిక్కులో గల పర్వతం మూలలో తమ త్రిదండంతో శ్రీరామానుజులు గీఱగా అక్కడ శ్వేతమృత్తిక గోచరించింది. దానిని చూచి వారు చాలా ఆనందించి, దానితో ద్వాదశోర్ధ్వపుండ్రాలను ధరించి, త్రిదండమండితకరపుండరీకులై ప్రకాశించారు. ఆ తరువాత అరణ్యప్రాంతాన్ని ఛేదింపచేసి, అక్కడ ఊరును, దేవాలయాన్ని నిర్మింపజేసి, తిరునారాయణస్వామికి పాంచరాత్రానికి చెందిన సాత్వతసంహితోక్తంగా సంప్రోక్షణాదులను రంగరాజ భట్టర్ ద్వారా జరిపించారు. తిరునారాయణస్వామికి నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాలను అన్నిటిని గొప్పగా నిర్వహించడానికి తగినట్లుగా ఉత్సవ విగ్రహం లేదుకదా ! అని శ్రీరామానుజులు వ్యాకులాన్ని పొందారు. అపుడు



ఒకనాటి రాత్రి శ్రీరామానుజులకు స్వప్నంలో తిరునారాయణ మూర్తి కనుపించి, "నా ఉత్సవమూర్తి అయిన రామప్రియులు ఇపుడు ఢిల్లీ నగరంలో తురుష్క ప్రభువు గృహంలో ఉన్నారు. అక్కడకు పోయి తీసికొని రండి" అని అన్నాడు. శ్రీరామానుజులు ప్రాతఃకాలం కాగానే లేచి తమ స్వప్నాన్నిగూర్చి తమ శిష్యులతో ఆలోచించి వేగంగా ఢిల్లీకి చేరారు. ఢిల్లీనగరప్రభువు వీరిని చూచి ఆహ్వానించి, ప్రణతిపూర్వకంగా చాలా ఉపచారాన్ని చేశాడు. "మీరు వచ్చిన కారణాన్ని తెలియ జేయాలి" అని అతడు విన్నవించగా, శ్రీరామానుజులు మా కులదైవం అయిన రామప్రియులు ఇక్కడ వేంచేసి ఉన్నాడు. అతనిని మాకు ఇవ్వండి" అని అపేక్షించగా, రాజుకూడా "ఆ విధంగానే చేస్తాను" అని, తాను కొల్లగొట్టి చెరసాలలో పెట్టిన అర్చామూర్తులను వెదకికోవలసినదిగా శ్రీరామానుజులతో అన్నాడు. వారు కూడా చెరసాలకు పోయి పరిశీలించి చూచి, అవి తిరునారాయణస్వామి రూపానికి పొసగనందువల్ల ఈ మూర్తులెవ్వరూ కారు- అని తలచి రామప్రియులను (ఉత్సవమూర్తిని) వారిలో చూడలేనందువల్ల విచారిస్తూ ఉండి పోయారు. ఆనాటి రాత్రి రామప్రియులు శ్రీరామానుజులకు కలలో కన్పించి, "మీరెందుకు విచారిస్తున్నారు? మేము ఢిల్లీ ప్రభువుకుమార్తెచేత ఆరాధింపబడుతూ ఆమె శయనాగారంలో ఉన్నాము. మమ్ములను తీసికొని పోవడం కోసం అక్కడకు రండి" అని అనగా, శ్రీరామానుజులు ఈ వృత్తాంతాన్ని ప్రభువుకు తెలిపారు. అతడు కూడా -"ఆ విధంగా మీపట్ల స్వామి వ్యామోహాన్ని కల్గి ఉంటే పిలవండి. అతడే వస్తాడు కదా!" అని అనగా, శ్రీరామానుజులు "ఆ మూర్తిని నేను చూచి నమస్కరించవచ్చునా?" అని అడిగారు. ప్రభువు సరే అని తన కుమార్తె శయనగృహానికి శ్రీరామానుజులను తీసికొనిపోయాడు. అక్కడ రామప్రియులను శ్రీరామానుజులు పిలువగా, ఆ అర్చామూర్తి, ఆశ్రితవాత్సల్యం స్ఫురించేటట్లుగా ధరించిన కంచుకంతో, కట్టిన చిఱు మువ్వలతో, పెట్టుకొన్న కస్తూరీనామంతో, ముడుచుకొన్న కాటుక రంగులోని నల్లని కేశాలతో, ముఖంలో వేలాడే పాపిట బొట్టుతో శయ్యనుండి దూకి, తన కాలి చిఱుమువ్వల సవ్వడి ఘల్లుఘల్లుమనగా, అందఱు చూస్తూ ఉండగా వచ్చి శ్రీరామానుజుల తొడపై కూర్చున్నాడు. శ్రీరామానుజులు ఆనందాశ్రువులను వర్షిస్తూ, ఆనందైకార్ణవాంతర్నిమగ్నులై, పులకితసర్వగాత్రులై, తమ వక్షస్థలం, బాహువులు ఉప్పొంగగా **"నా శెల్వపిళ్ళా!**

**వారాయ్!"** (నా సంపత్కుమారా! రా) అని అంటూ ఎత్తుకొని ఆలింగనం చేసికొన్నారు. ఆనాటినుండి రామప్రియులకు **"శెల్వపిళ్ళై"** అనే తిరునామం కల్గింది. దీనిని చూచిన రాజుకూడా అత్యాశ్చర్యాన్ని పొంది, శ్రీరామానుజుల పాదాలపై పడి సేవించి, అనేక రీతులలో సత్కరించి బహూపచారసహితంగా సంపత్కుమారులను ఆ యతిసార్వభౌములకు సమర్పించాడు.

శ్రీరామానుజులు అక్కడనుండి బయలుదేరి సంపత్కుమారులను వేంచేపు చేసికొని వేగంగా పయనించి యాదవగిరిని చేరారు. అక్కడ అందఱు సంపత్కుమారులను పుత్రవాత్సల్యంతో అభిమానించి, సంప్రోక్షణాది ప్రతిష్ఠాపురస్సరంగా ఆ మూర్తిని తిరునారాయణమూర్తితో చేర్చారు. శ్రీరామానుజులు తరువాత యాదవగిరిలో నిత్యోత్సవ- పక్షోత్సవ -మాసోత్సవ- అయనోత్సవ- సంవత్సరోత్సవాది మహోత్సవాలను నడపించారు. యతిరాజమఠాన్ని కట్టించి, 52మందికి (ధర్మకర్తలకు) ప్రియమైన, తగిన నిత్యకైంకర్యాన్ని ఏర్పరచారు. **"ఐమ్బత్తిరువర్ శ్రీవైష్ణవర్కళ్"** అనే సముదాయనామాన్ని, ప్రత్యేకమైన దాస్యనామాన్ని వారికి ప్రసాదించి, అక్కడ వారిని నిలిపి, ఏలోటు లేకుండా వారి ద్వారా తిరువారాధనను జరిపిస్తూ వచ్చారు. ఒకనాడు భగవద్రామానుజులు తమ శ్రీచరణసమీపంలో ఉండే ఆచార్యులతో, జీయర్‌లతో, యాభైరెండుమంది సన్నిధి కైంకర్యపరులతో, చాత్తాద శ్రీవైష్ణవులతోను కలసి వేంచేసి ఉండే సమయంలో యాదవగిరికి **''తిరునారాయణపురమ్''** అనే నామాన్ని పెట్టి, ''ఈ తిరునారాయణపురంలో నిత్యవాసాన్ని చేసేవారికి పెద్దలకు, మనకు కలిగే పరమపదం, ఆచార్యకైంకర్యం లభిస్తుంది'' అని పలికారు.

అచటి శ్రీవైష్ణవగోష్ఠికి ఉభయవేదాంతప్రవచనాన్ని చేస్తూ, తిరునారాయణ స్వామికి నిత్యకైంకర్యాలను నిర్వహిస్తూ శ్రీరామానుజులు తిరునారాయణపురంలో వేంచేసి ఉండగా, కొంతకాలానికి తరువాత ఒకనాడు శ్రీరామానుజులు తమ శిష్యులతోపాటు అనుష్ఠానార్థం కల్యాణసరస్తీరానికి వెళ్ళినపుడు శ్రీరంగంనుండి వచ్చిన **మాఱొన్ఱిల్లా మారుతి శిఱియాణ్డాన్, అమ్మఙ్గియమ్మాళ్** అనే ఇద్దఱు శ్రీవైష్ణవులు శ్రీరామానుజులను సేవించి, దండం సమర్పించి "స్వామీ ! కూరేశులు, మీ ఆచార్యులైన పెరియనంబి నేత్రదర్శనం కోల్పోవడానికి కారణమైన ఆ చోళుడు



గొంతులో పుట్టిన రాచపుండువల్ల మరణించాడు. దేవరవారు మళ్ళీ శ్రీరంగానికి వేంచేసి అనుగ్రహించండి'' అని విన్నపించారు. పరమపాపి అయిన చోళుడు నశించిన విషయాన్ని తమకు తెలిపిన వారిని ఆనందంగా కౌగలించుకొని, ఆనందాశ్రువులు జాలువారగా వారిని ఆశీర్వదించి, "ఇంతదూరం ప్రయాణించి వచ్చి, ఇంతటి మంచి వార్తను చెప్పిన వారికి గొప్పగా ఇవ్వగల్గినది ద్వయం తప్ప ఇంకొకటి లేదు'' అని నిశ్చయించి మళ్ళీ వారికి ద్వయమంత్రాన్ని బహుమతిగా ఉపదేశించారు. తమ సన్నిధిలో ఉండే శిష్యులను చూచి- "ఇది కల్యాణసరస్సు అనే విషయం ఇపుడు సార్థకం కావడాన్ని గమనించాము'' అని అన్నారు. శిష్యులు కూడా "నిజమే'' అని అన్నారు. వారిని తీసికొని శ్రీరామానుజులు ప్రహ్లాదవరదుడైన నృసింహస్వామి కొండను ఎక్కి, ఆ స్వామిని సేవించారు. "భగవద్భాగవతవిషయం అంటే సహించలేని హిరణ్యుని పూర్వం నిరసించినట్లే ఇపుడుకూడా పరతత్త్వమైన నీవు లేవని, సత్పురుషులకు ఉపమానంగా చెప్పబడిన ప్రహ్లాదునివంటి కూరేశులకు, పెరియనంబికి అపచారం చేసిన ఇతనిని కృమికంఠునిగా చేసి నశింపజేశావా !'' అని ఆ స్వామికి విన్నపించి, తీర్థప్రసాదస్వీకారాన్ని చేసి అనుమతిని పొంది కిందకు వచ్చారు. తిరునారాయణపురస్వామి సన్నిధిని చేరి సేవించి, తిరుప్పల్లాణ్డును అనుసంధించి మంగళాశాసనం చేసి, **"నమో నారాయణాయ"** అని అంటూ అంజలి చేశారు. ఆ భగవానుని శ్రీచరణాలకు నమస్కరించి "ఇక నేను శ్రీరంగానికి పోయి వస్తాను'' అని శ్రీరామానుజులు విన్నపించగా, తిరునారాయణస్వామి చాలాసేపటివరకు ఏమీ బదులు పల్కనందున - "స్వామీ ! నీవే ఇంతకుముందు **"యావజ్జీవం శ్రీరంగే సుఖమాస్స్వ"** అని అన్నావుకదా !'' అని శ్రీరామానుజులు విన్నపించగా, స్వామికూడా సరే, "ఆ విధంగానే కానివ్వండి'' అని అర్చకముఖంగా పలికాడు.

శ్రీరామానుజులు తరువాత యాభైరెండుమంది కైంకర్యపరులను చూచి "తిరునారాయణస్వామిని, శెల్వపిళ్ళైను (మూలమూర్తి, ఉత్సవమూర్తులను) మంగళాశాసనపూర్వకంగా సదా దర్శిస్తూ యథాకాలం తిరువారాధనను నిర్వహిస్తూ ఉండండి'' అని నియమించారు. వారు శ్రీరామానుజుల పాదాలపై పడి సేవించి, "దేవరవారి శ్రీచరణాలను విడచి మేము క్షణం కూడా ఉండలేము'' అని ఆర్తులై

నిలచారు. అపుడు శ్రీరామానుజులు ఆలోచించి, తమ అర్చావిగ్రహాన్ని నిర్మింపజేసి, అందులో తమ దివ్యశక్తిని ప్రతిష్ఠింపజేసి, యాభైరెండు మంది కైంకర్యపరులను పిలచి, ''నేను మీకోసం ఈ రూపంలో వేంచేసి ఉంటాను'' అని పల్కి, స్వదివ్యశక్తిపరిపూర్ణమైన ఆ విగ్రహాన్ని వారికి తిరువారాధనగా అనుగ్రహించారు. వారిని చూచి,- "శెల్వపిళ్ళైను నిక్షేపంవలె రక్షించి, **"తిరువిళక్కు (దీపం) తిరుమాలై, శాత్తుప్పడి (అలంకారం)** మొదలైన ఉపచారాలను అన్నిటిని చాలా ఆదరంతో చేస్తూ, ఏద్రోహబుద్ధితో ఏ కీడును తలపెట్టకుండా, అన్యోన్యం సహృదయులై, నిత్యకైంకర్యాలను మఱువకుండా భక్తితో చేయండి'' అని తమ శ్రీచరణాలను వారిచే స్పృశింపజేసి ఆజ్ఞాపించారు. తరువాత, శెల్వప్పిళ్ళైను విడువలేకుండా ఆ స్వామి శ్రీచరణాలను మాటిమాటికి సేవిస్తూ, మనస్సులో ద్రవిస్తూ కన్నులు బాష్పవర్షం జాలువారగా, తిరునారాయణపుర దివ్యవిమానాన్ని, క్షేత్రాన్ని, అక్కడి ఉద్యానవనాలను, శ్వేతమృత్తికలయొక్క గుట్టలను మాటిమాటికి చూస్తూ అంజలిని చేసి మంగళాశాసనాన్ని చేసి, పుత్రవాత్సల్యం వెనుకకు తోయగా, శ్రీరంగనాథుని అనుగ్రహం ముందుకు నడిపింపగా అతికష్టంపై శ్రీరంగాన్ని చేరారు.

## భగవద్రామానుజులు - మేల్కోటై ఆలయకైంకర్యాలు, ఆచారవ్యవహారాలు

భగవద్రామానుజులు తిరునారాయణపురంలోని కోవెల పునరుద్ధరణను చేసిన వృత్తాంతాన్ని తెలిపే సందర్భంలో వారికి ఈ ఆలయనిర్మాణ, నిర్వాహాలతో గల సంబంధాన్ని తెలిపే కొన్ని అంశాలు ఇదివరకే ప్రస్తావింపబడ్డాయి. శ్రీరామానుజులు యాదవగిరి ప్రాంతానికి చేరిన సమయానికి అది ఒకవిధంగా పాడు పడిన చోటు. శ్రీరామానుజులు అచట ఆలయనిర్మాణాదులను అర్చామూర్తులను పునరుద్ధరించడమే గాక ఆ ఆలయ నిర్వహణకు సంబంధించిన పలు సంస్కరించి కట్టుదిట్టాలను, కట్టుబాట్లను ఏర్పాటుచేశారు. ఈ వివరాలు అన్నీ **"ఉడైయవర్ నియమనప్పడి"** అనే వారి ఆజ్ఞాపూర్వకమైన గ్రంథంలో సూచింపబడ్డాయి. ఈ గ్రంథం ఒక అపూర్వమైన, విలువైన చారిత్రకాధారం. ఈ నియమనిబంధనలు అన్నీ వైదికమైనవి. మనుస్మృతివంటి వివిధస్మృతులకు, శిష్టాచార సంప్రదాయాలకు అనుగుణమైనవి. 7 విధాలైన, వివిధశాఖలకు చెందిన 57 విధాలైన కైంకర్యాలను, వాటిని నిర్వహించడానికి తగిన యోగ్యతలను కలవారిని నిర్ణయించి, (ఆళ్వార్



తిరునగరి ప్రాంతంనుండి రప్పించి) నియమించారు. వారు క్షేత్రంలో ఎక్కడ ఎక్కడ నివసించాలో ఆ విషయాన్నికూడా నిర్ధారించారు. వీరి నివాసాలు ఆలయ పరిసరాలనుండి నగరప్రారంభంవరకు విస్తరించాయి. ఆలయంలోని ఆరాధనాదులు పాంచరాత్రాగమానికి చెందిన సాత్త్వత (ఈశ్వర) సంహితానుగుణంగా నిర్వహింపబడాలని నిర్ధారించారు. శ్రీరంగంనుండి శ్రీరంగరాజభట్టర్‌ను ఆరాధననిర్వహణార్థం రప్పించారు. 52 మంది ఆలయ కైంకర్యపరులుగా యోగ్యతను కల శ్రీవైష్ణవులను నియమించారు. ఆలయసంప్రదాయాలను, ఆచారాలను, ఆలయానికి చెందిన ఆస్తిపాస్తులను తమ అనంతరం తమ ప్రతినిధిగా నిలచి, ఏలోటు లేకుండా నిర్వహించడంకోసం శ్రీయదుగిరి యతిరాజజీయర్ మఠాన్ని నెలకొల్పారు. ఆ మఠవ్యవస్థ ఈనాటికీ అవిచ్ఛిన్నంగా కొనసాగడం విశేషం. తమ ఆజ్ఞను, సంప్రదాయాలను పరిరక్షించి ప్రచారం చేయడానికి ఆనందాళ్వాన్ వంశీయులను, తోళ్ళప్పర్‌వంశీయులను, ఆయ్ వంశస్థులను నియమించారు.

విష్ణువర్ధనుడు సమకూర్చిన కోటి బంగారు వరహాల సొమ్మును తిరునారాయణస్వామి ఆలయపునర్నిర్మాణానికి కొంత వినియోగించారు. శ్రీసుదర్శనుని ఆలయాన్ని, తాయార్ ఆలయాన్ని కూడా నిర్మింపజేసి, మిగిలిన సొమ్మును పలు నిత్యనైమిత్తికోత్సవాల నిర్వహణకోసం మూలనిధిగా నిలిపారు. ఆనందమయ విమానం చుట్టూ అందమైన ఆలయనిర్మాణాన్ని చేయించారు. విమానానికి ముందు శుకనాసిక నవరంగ మండపాన్ని, బంగార వాకిలివరకు గల గోపురప్రాకారాదులను కట్టించారు. 52 మంది కైంకర్యపరులను నాల్గు శాఖలుగా విభజించి వారికి తిరువనంతపురదాసర్- తిరుమాలై దాసర్, తిరుక్కుఱుఙ్గుడి దాసర్, యతిరాజదాసర్ అనే దాస్యనామాలను పెట్టారు. ఈ విధంగా తిరునారాయణపురం ఆలయంలోని ఆచారవ్యవహారాల వ్యవస్థకు, కైంకర్యాల వ్యవస్థలకు భగవద్రామానుజులు మూలం. **"రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతామభివర్ధతామ్"** అనే రీతిలో వారి దివ్యాజ్ఞాప్రభావంవల్లనే ఈనాటికీ ఆ కోవెలలోని వ్యవస్థలు సురక్షితంగా కొనసాగుతున్నాయనడంలో ఏ సందేహం లేదు.

శ్రీరామానుజులు ఎంత గొప్ప పండితులో, అంతటి ఉదారహృదయులు, విశాలమైన భావాలను కలవారు. తిరునారాయణపురం ఆలయపునరుద్ధరణ కైంకర్యంలో విశేషమైన సహకారాన్ని అందించిన అంత్యకులానికి చెందినవారికి

**"తిరుక్కులత్తార్"** అనే గౌరవప్రదమైన నామాన్ని పెట్టడమేకాక, వారికి శ్రీరంగం, తిరునారాయణపురం, బేలూరు మొదలైనచోట్ల ఆలయాలలో బలిపీఠం-ధ్వజస్తంభంవరకు ప్రవేశాన్ని కల్గించారు.

## శ్రీరామానుజులు మేల్నాడునుండి (తిరునారాయణపురం నుండి) తిరిగి వచ్చి కూరేశులను కలవడం

క్రమంగా శ్రీరంగానికి చేరిన శ్రీరామానుజులు శిష్యులతోపాటు కూరేశుల ఇంటికి వెళ్ళి, వారిని చూచారు. శ్రీరామానుజుల రాకను విన్న కూరేశులు సంతోషంగా స్వాగతాన్ని పల్కి, వారి శ్రీపాదాలలో మొదలు నఱికిన చెట్టువలె పడి నమస్కరించారు. శ్రీరామానుజులు వారిని పట్టి లేవనెత్తి, ఆలింగనం చేసికొని, శోకవేగంతో వెంటనే ఏమీ పలుకలేకపోయారు. దుఃఖోద్వేగంవల్ల కంఠం అవరుద్ధమైనది. "కూరేశా! ఈ దర్శనానికి నేత్రభూతులైన మీకు ఈ విధంగా జరిగిందే! ఇది అంతా నా పాపఫలం సుమా! **"మత్పాపమేవాత్ర నిమిత్త మాసీత్"** అని అంటూ పలు రీతుల్లో పలవరించారు. మఱికొంతసేపటికి తేరుకొని, కూరేశులనుకూడా సముదాయించి, తమ మఠాన్ని చేరారు. క్రమంగా పూర్వంవలె దర్శననిర్వాహాన్ని చేస్తూ శ్రీరంగంలో శ్రీరామానుజులు కొంత కాలం గడిపారు.

## శ్రీవేంకటేశ్వరస్వామికి శంఖచక్రప్రదానం

పూర్వం ఒకానొక సమయంలో వేంకటేశ్వరుడు తన శ్రీహస్తాలలోని సుదర్శనపాంచజన్యాలనే ఆయుధాలను తనపట్ల గొప్పభక్తిని కల్గిన తొండమాన్ చక్రవర్తికి శత్రునిరసనార్థం అతని ప్రార్థనపై ఇచ్చాడు. తాను ఆ విధంగా భక్త పరతంత్రుడననే విషయం లోకానికి స్పష్టం చేయడం కోసం తిరిగి ఆ ఆయుధాలను తొండమాన్ చక్రవర్తి ప్రార్థనపై తన శ్రీహస్తంలో ధరించకుండా శూన్యహస్తుడై ఉండిపోయాడు. క్రమంగా కలిప్రభావంవల్ల వర్ణాశ్రమధర్మాలు లోపించి, అన్ని దేవాలయాలలోని ఆచార వ్యవస్థకు భంగం కల్గింది. తిరుమల ఆలయంలో వైఖానసులు భగవానునకు చేసే ఆరాధనకుకూడా లోపం ఏర్పడింది. ఈ అవ్యవస్థను ఆధారంగా చేసికొని ఇదే సమయం- అని పలువురు అన్యమతాలవారు తిరుమల వైష్ణవక్షేత్రం కాదని, శ్రీవేంకటేశ్వరుడు విష్ణువు కాదని- వాదించడం ప్రారంభించారు. శైవులు శివుడని, శాక్తేయులు శక్తిస్వరూపం అని, ఇంకా మఱి కొందఱు కుమారస్వామి అని- ఈ



విధంగా పలు వాదాల కోలాహలం ఏర్పడింది. తిరుమల తిరుపతి ప్రాంతాన్ని పాలించే ప్రభువు యాదవరాయలవద్దకు వెళ్ళి, తమ తమ వాదాలను అతనికి విన్పించి, మెల్లిగా ఆ ప్రభువుతో స్నేహాన్ని సంపాదించారు. అతనిని వద్దకు చేరి- "తిరుమలలో స్వామిపుష్కరిణికి దక్షిణదిశలో ఉన్న ఆలయంలో నెలకొని ఉండే అర్చామూర్తి కుమారస్వామి. ఆ దేవుని పేరుతోనే **"నామగ్రహణే నామైకదేశగ్రహణ"**మనే న్యాయంతో కొండపై కోనేరు స్వామిపుష్కరిణిగా వ్యవహరింపబడుతున్నది; వామనపురాణాంతర్గతం అయిన, శ్రీవేంకటాచల మాహాత్మ్యాన్ని వర్ణించే భాగంలోని రెండవ అధ్యాయంలో సుబ్రహ్మణ్యస్వామి వేంకటాచలం లోని ఒక సరస్సు తీరంలో తపస్సును చేశాడని తెలుపబడినందువల్ల ఆ కొండపై ఉన్నమూర్తి కుమారస్వామే; ఆ స్వామికి ఆసాధారణ ఆయుధాలు పాశం, అంకుశం ఆ మూర్తిలో కనబడకపోవడానికి కారణం- ఆయన తపోనిష్ఠలో ఉండడమే; ఇవేకాక, ఇంకా పలు హేతువులవల్ల ఈ పర్వతం అనాదిగా శైవక్షేత్రమే; ఇపుడే కొంతకాలంగా కొందఱు శ్రీవైష్ణవులు కలిసి పురాణార్థాలను వారి ఇష్టానుసారంగా పల్కుతూ, ఆ స్వామి విష్ణువేనని వాదిస్తూ, ప్రభువును వశీకరించుకొని, కొన్ని వైష్ణవవిగ్రహాలను బలవంతంగా ఆలయాలలో స్థాపించి, ఆరాధనాదులను ఉత్సవాదులను జరిపిస్తున్నారు; వాస్తవానికి ఇది శైవక్షేత్రం అయినందువల్ల, శైవవిధిప్రకారమే ఇకపై ఈ ఆలయంలో పూజోత్సవాదులు జరిగేటట్లుగా మహాప్రభువులైన మీరు శాసనం చేయాలి'' అని ఈ విధంగా పలుమార్లు పలు రీతులలో ప్రార్థించి, బలవంతపెట్టారు.

అపుడు యాదవరాజు సహజంగా వైచక్షణ్యాన్ని కలవాడు కనుక, శైవులు పల్కిన మాటలను అన్నిటినీ విని ఆలోచించాడు. "వీరు పలికే మాటలన్నీ అనుభవవిరుద్ధంగా, శాస్త్రవిరుద్ధంగా కన్పడుతున్నాయి. బాగా పరిశీలించి, విచారించకుండా నేను ఏ నిర్ణయానికి రావడం మంచిది కాదు'' అని అనుకున్నాడు. తిరుమల ప్రాంతంలో ఆ సమయాన ఆ క్షేత్రాన్నిగూర్చి ఇదమిత్థంగా సహేతుకమైన, సశాస్త్రీయం అయిన నిర్ణయాన్ని చేయగల పండితులు శ్రీవైష్ణవులలో ఎవ్వరూ అతనికి కన్పించలేదు. కొందఱు శ్రీవైష్ణవులద్వారా శ్రీరంగంలో విశిష్టాద్వైతసిద్ధాంతనిర్వహణధురంధరులై ఖ్యాతిని గడించిన శ్రీరామానుజులనుగూర్చి విన్నాడు. శైవులు యాదవరాజుకు చేస్తున్న దుర్బోధలను గూర్చి, వారు తలపెట్టిన అన్యాయాన్నిగూర్చి, శ్రీవైష్ణవులు కొంతమంది శ్రీరంగానికి వెళ్ళి శ్రీరామానుజులకు విన్నవించారు. అపుడు శ్రీరామానుజులు తిరుపతికి

వేంచేసి, యాదవరాయలను కలిశారు. తిరుమలపై వేంచేసి ఉండే అర్చామూర్తి విషయంలో సంశయగ్రస్తుడైన అతనిని చూచి- "రాజా ! శైవులు పల్కిన మాటలవల్ల నీ మనస్సులో కల్గిన శంకాకళంకాన్ని తీర్చి, నీకు నిశ్చయాన్ని కల్గించడం కోసమే అంతదూరం నుండి ఇక్కడకు వచ్చాను. నీకు పరిపూర్ణమైన తృప్తి కలిగేటట్లుగా వివరిస్తాను విను'' అని అన్నారు. అపుడు ఆ రాజు తనకు పలు విధాలుగా దుర్బోధలను చేసిన శైవులను పిలిపించి, పెద్ద సభను ఏర్పాటుచేశాడు. ఆ సభలో శైవులకు, వైష్ణవులకు మధ్య తిరుమలపై వేంచేసి ఉండే అర్చామూర్తి ఎవరు? అనే విషయంలో చర్చ జరగాలని, నియమించాడు. తాను తటస్థుడైన శ్రోతగా ఆ సభలో ఉన్నాడు. చాలా కాలం సభలో వాదప్రతివాదాలు జరిగాయి. శైవులు చేసిన వాదాలను అన్నిటినీ శ్రీరామానుజులు సప్రమాణంగా ఖండించి, జయించారు. (శైవులకు- శ్రీరామానుజులకు మధ్య జరిగిన వాదప్రతివాదాల వివరం అనంతార్యవిరచితమైన **"శ్రీవేంకటాచలేతిహాసమాల"**- అనే సంస్కృత గ్రంథంలో గమనించవచ్చు. ఈ వివరం సుమారు 65 పుటలకు పైగా విస్తరించి ఉన్నది. గొప్ప వాక్యార్థశైలిలో ఈ భాగం రచింపబడింది) సభలో శ్రీరామానుజుల వాగ్ధాటికి, వారు ప్రమాణపూర్వకంగా వాస్తవాన్ని ప్రతిపాదించిన తీరుకు ఎంతో ముగ్ధుడైన యాదవరాజుకు మనస్సులో అంతవరకు ఉన్న సందేహాలన్నీ పటాపంచలయ్యాయి. శ్రీవేంకటాచలం విష్ణుక్షేత్రమే అని, అక్కడ ఉండే మూర్తి విష్ణువేనని నిశ్చయించుకొన్నాడు. "ఈ శ్రీరామానుజులు సామాన్య వ్యక్తి కానేరరు. అవతారపురుషులు. వీరు తలచుకొంటే ఎటువంటి అతిమానుషాలైన కార్యాలను అయినా చేసి, అందఱికీ స్థిరమైన నమ్మికను కల్గించగల సమర్థులు. అటువంటి వీరిని ఇపుడు ఆ విధంగా చేయమని వీరిని ప్రార్థిస్తాను'' అని భావించి, శ్రీరామానుజులతో "స్వామీ! యోగివరేణ్యా! మీరు నిరూపించిన శాస్త్రార్థాలను విని పరమానందాన్ని పొందాను. శ్రియఃపతియే తిరుమల కొండపై వేంచేసి ఉన్నాడని బాగా తెలిసికొన్నాను. సంశయం ఏమాత్రం లేకుండా నా మనస్సులో స్థిరమైన నమ్మిక ఏర్పడింది. అయినా, మహాపురుషులై, అతిమానుషచేష్టితులైన మీరు పండితపామర భేదం లేకుండా, అందఱికీ తెలిసేటట్లుగా ఏదైనా ఒక నిదర్శనాన్ని చూపించడం మంచిది కదా!'' అని అంజలిబద్ధుడై వేడాడు. అతని మాటను విన్న శ్రీరామానుజులు శ్రుతిస్మృతీతిహాస పౌరాణికవృత్తాంతాలను, ప్రమాణాలను అనేకంగా చూపించి వివరించినా, ఈ ప్రభువు మనస్సు ఇంకా పూర్తిగా తృప్తిని పొందినట్లుగా లేదు. అతిమానుషం అయినది ఏదైనా ఒక కార్యాన్ని చేసి చూపించమంటున్నాడు. సరే కానీ, ఈవిధంగా చేసి చూపిస్తాను. బ్రహ్మాండపురాణంలోని 11వ అధ్యాయంలో



భగవానుడు స్వయంగా నోఱు తెరచి ప్రతిజ్ఞను చేసిన రీతిలోనే కలియుగంలో విమానమండపాదులనువలె శంఖచక్రాదులను భక్తులు నిర్మించి, సమర్పిస్తే స్వీకరించి తీరుతాడు. కనుక, నేను నిర్మించి సమర్పించే దివ్యాయుధాలను భగవానుడు స్వీకరించవచ్చునుకదా! ప్రార్థించి అయినా అతడు వానిని స్వీకరించేటట్లు చేస్తాను. లేకపోతే ఇపుడు పెద్ద అనర్థం సంభవించేటట్లున్నది. ఈ అపూర్వకృత్యంవల్లనే అందఱికీ విశ్వాసం కలగాలి'' అని మనస్సులో ఆలోచించి, ఆ విధంగా చేయాలని నిశ్చయించు కొన్నారు. యాదవరాజును చూచి "రాజా! నేను భగవానునకు అసాధారణచిహ్నాలైన సుదర్శన, పాంచజన్యాలను చేయించి, తీసికొని వచ్చి భగవత్సన్నిధిలో ఉంచుతాను. ఈ శైవులు కూడా తాము తమ దైవానికి సంబంధించిన పాశం, అంకుశం మొదలైన ఆయుధాలను చేయించి తీసికొని రమ్మని చెప్పు. ఏ ఆయుధాలను స్వామి స్వీకరించి అనుగ్రహిస్తాడో చూద్దాం'' అని అన్నారు.

యాదవరాజు అపుడు సంతోషంతో- "నిజమే! ఇది మంచి ఉపాయం. దీనివల్ల ఎవరికీ ఆక్షేపం ఉండదు. ఈ విధంగానే రెండు పక్షాలు చేయాలి'' అని ఆదేశించాడు. రెండు పక్షాలవారు తమ తమ దైవాలకు సంబంధించిన అసాధారణ ఆయుధాలను నిర్మించి తీసికొని వచ్చారు. ఒకనాడు అందఱు యాదవప్రభువుతో పాటు తిరుమలను చేరి, ఆనాటి రాత్రి ఆలయం తలుపులు మూయడానికి ముందు ఆ ఆయుధాలను గర్భాలయంలో పెట్టి ఆలయ తలుపులు మూశారు. ఎవరూ తలుపులను తెఱవడానికి వీలులేని విధంగా బీగాలపై రాజముద్రను ముద్రించారు. కావలివాళ్ళను రక్షణకై ప్రభువు నియమించాడు.

భగవద్రామానుజులు ఆ రాత్రి యోగమాయతో దేవాలయంలో ప్రవేశించి, భగవానుని ప్రత్యక్షం చేసికొని "పరమపురుషా! పూర్వం నీవు స్వయంగా చేసిన ప్రతిజ్ఞానుసారంగా నీ అసాధారణ చిహ్నాలను పరిగ్రహించి, అలంకరించుకొని, దాసులమైన మమ్ము రక్షించు'' అని ప్రార్థించారు. భగవానుడు శ్రీరామానుజులు చేసిన ప్రార్థనను అనుసరించి, సుదర్శనపాంచజన్యాలను తన చేతులలో ధరించాడు. మఱునాడు ప్రభాతవేళ యాదవరాజు అందఱిని వెంటబెట్టుకొని వచ్చి, కోవెల తలుపులు తెఱిపించాడు. శ్రీవేంకటేశ్వర స్వామిని అందఱు సేవించగా పాశం, అంకుశంవంటి ఆయుధాలు ఒక పక్కగా పడి ఉండడాన్ని, స్వామి శ్రీసుదర్శన పాంచజన్యాలంకృతుడై ఉండడాన్ని చూచి అందఱు చాలా ఆశ్చర్యపడ్డారు. యాదవరాజు భగద్రామానుజులపట్ల

అంతులేని గౌరవాన్ని కల్గినవాడై, వారిని శరణాగతి చేసి కృతార్థుడయ్యాడు. కుత్సితవాదాలను చేసిన ప్రతివాదులను తృణీకరించి, వారిని పంపించివేశాడు.

తిరుమలలో శ్రీరామానుజులు పలు కైంకర్యాలను నిర్వహించారు. శుక్రవారం ఉత్తర ఫల్గునీ నక్షత్రం శుక్లపక్ష ద్వాదశినాడు రత్నమాలికా యోగంలో కనక కంఠికలో వ్యూహలక్ష్మిని ప్రతిష్ఠించారు. దీనివల్లనే శ్రీనివాసునకు సంపద నిత్యాభివృద్ధంగా విలసిల్లుతున్నది. శ్రీరామానుజులు శ్రీనివాసునకు రెండవ నాగాభరణాన్ని సమర్పించారు. ఆలయం లోపల ఈశాన్యమూలలో యోగనరసింహస్వామిని ప్రతిష్ఠించారు. కొండను ఎక్కేవారు. భగవానునకు మిక్కిలి ప్రీతికరమైన గోవిందనామాన్ని ఉచ్చరించాలని నియమించారు. క్షేత్రం వరాహక్షేత్రం కనుక కొండపై ముందుగా శ్రీవరాహస్వామికి నివేదన జరగాలని, భక్తులు ముందుగా వరాహస్వామిని దర్శించాలని నియమించారు. వరాహస్వామి అవతార నక్షత్రమైన తులామాసం శ్రవణా నక్షత్రంనాడు విశేషోత్సవం జరగాలని ఏర్పాటుచేశారు.

తిరుమలకై జీయర్ వ్యవస్థను ఏర్పాటుచేసిన వారు శ్రీరామానుజులే. తిరుమల నంబి వృద్ధులైనందున తిరుమల ఆలయంలోని కైంకర్య, సమయాచారాల నిర్వహణ బాధ్యతను తన శిష్యులు అనంతార్యులకు అప్పజెప్పారు. వారుకూడా క్రమంగా వయస్సు మీరి అశక్తులు కాగా, వారి శిష్యులలో ఒక బ్రహ్మచారికి వైరాగ్య సూచకమైన కాషాయాన్ని ధరింపజేసి, ఆయనకు సేనాపతి యతి అనే పేరునుపెట్టి, తిరుమలలోని కైంకర్య నిర్వహణ బాధ్యతను ఆయనకు అప్పగించారు. బేడి ఆంజనేయస్వామి సన్నిధి దగ్గరలో ఆ యతికి మఠాన్ని కట్టించి, అందులో తమకు శ్రీరామాయణ కాలక్షేప సమయంలో శ్రీశైల పూర్ణులు ప్రసాదించిన శ్రీరాముని అర్చామూర్తిగా ప్రతిష్ఠించారు. హనుమంతుని ముద్రణ కల ఉంగరం, హనుమన్ముద్రాంకితమైన గంట, హనుమంతుని ముద్రను కల ధ్వజాన్ని ఇప్పించారు.

కొంతకాలం తరువాత ఈ బ్రహ్మచారికే సన్న్యాసాశ్రమాన్ని ఇప్పించి శఠకోప నామంతో **"శ్రీవేంకటనాథ శఠకోప యతి"** అనేపేరును పెట్టారు. వారికి సహాయకులుగా నలుగురు ఏకాంగులను నియమించారు. ఈ శఠకోపయతియే జీయర్. ఈ జీయర్ వ్యవస్థ ఈ నాటికి తిరుమలలో కొనసాగుతున్నది.



కొండపై ఆలయం నాల్గు దిశలోని వీథులను సమంచేసి, బ్రహ్మోత్సవాలలో వాహన సేవలన్నీ తిరుమలలోనే జరిగేటట్లు చేశారు. తిరుపతిలో గోవిందరాజస్వామిని ప్రతిష్ఠించారు. ఆ ఆలయానికి నలువైపుల విశాలమైన వీథులను ఏర్పరచి, ఆలయ పరివారం ఎవరెవరు ఎక్కడ ఉండాలో ఆశ్రమాన్ని ఏర్పరచారు. ఆలయం అభివృద్ధి చెందేటట్లు గోవిందరాజస్వామికి దక్షిణదిశలో గోదాదేవిని ప్రతిష్ఠించారు. ఈవిధంగా తిరుమలలలోను, తిరుపతిలోను శ్రీరామానుజులు పలు కైంకర్యాలను చేశారు. ఎన్నో ఆచార వ్యవస్థలను క్రమబద్ధీకరించారు.

## శ్రీరామానుజుల వైభవాన్ని పలువురు ప్రకాశింపజేసిన వివరం

భగవద్రామానుజుల వైభవాన్ని శ్రీరంగనాథుడు, శ్రీవేంకటేశ్వరుడు, వరదరాజస్వామి, తిరునారాయణ ప్పెరుమాళ్, అழகర్ (సుందరబాహుస్వామి), తిరుక్కుఱుంగుడి నమ్బి, నమ్మాழ்వార్లు, శ్రీమన్నాథమునులు, ఆళవందార్, పెరియనంబి, తిరుక్కోట్టియూర్నంబి, తిరుమలైనంబి, తిరుమలైయాణ్డాన్, తిరురంగప్పెరుమాళ్ అరైయర్, ఇంకా పలువురు పూర్వాచార్యులు వ్యక్తం చేశారు.

1. **శ్రీరంగనాథుడు :** "ఉభయవిభూతి ఐశ్వర్యాన్ని మీకు, మీ సంబంధాన్ని, వారి సంబంధాన్ని కల్గినవారికి ఇచ్చాము. ఈ సంపదకు మీరే సొత్తుదారులు" అని పల్కి శ్రీరామానుజుల వైభవాన్ని ప్రకటించాడు.

2. **శ్రీవేంకటేశ్వరుడు :** శ్రీరామానుజులు తిరుమలలో శ్రీవేంకటేశ్వరుని సేవించినపుడు, ఆస్వామి "మీకు, మీ సంబంధాన్ని కలవారికి ఉభయవిభూతి సంపదను అనుగ్రహించామని దక్షిణదిక్కులోని మా ఇంటిలో (శ్రీరంగంలో) పలికాము కదా" అని పలికాడు. ఇంతేకాక, శ్రీరామానుజులు తిరుమలకు వేంచేసినపుడు పెరుగును అమ్మే తుమ్బైయార్కొండి అనే గోపవనిత ప్రతిదినం తాను అమ్మిన పెరుగుకు మూల్యాన్ని పొందడంకోసం వారిని సేవించి నిలచింది. అపుడు శ్రీరామానుజులు ఆమెకు తళిహప్రసాదాన్ని (భగవన్నివేదితప్రసాదాన్ని) ఇవ్వమని కిడాంబిఆచ్చాన్ను నియమించారు. ఆచ్చాన్కూడా ఆమెకు ప్రసాదాన్ని ఇచ్చారు. ఆ ప్రసాదాన్ని స్వీకరించి వెంటనే ఆమెకు జ్ఞానోదయమైనది. అపుడామె "నాకు దధి మూల్యం అక్కరలేదు. మోక్షాన్ని అనుగ్రహించండి, చాలు"- అని అన్నది. శ్రీరామానుజులు "దానికి

శ్రీవేంకటేశ్వరుడు బాధ్యుడు సుమా!'' అని అనగా, "అయితే మీరొక చీటిని నాకు వ్రాసి ఇవ్వండి'' అని పల్కి వారినుండి ఆ విధంగానే మోక్షాన్ని పొందుతున్నట్లు చీటిని పొందింది. శ్రీరామానుజులు ఆమె విశ్వాసానికి సంతోషించి, తిరుమలకు వేంచేసి, శ్రీవేంకటేశ్వరుని దర్శించి ఆ చీటిని చదివి, గోపవనితకు మోక్షాన్ని అనుగ్రహించారు.

3. శ్రీవరదరాజస్వామి : శ్రీరామానుజులు అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్‌తో (యజ్ఞమూర్తితో) వాదించినపుడు, ఒక సమయంలో సమాధానాన్ని చెప్పలేకపోయిన స్థితిలో, వరదరాజస్వామిని ప్రార్థించగా, అపుడు వరదరాజస్వామి "మీరు ఈరీతిలో బదులు పల్కండి'' అని చిఱునవ్వుతో శ్రీరామానుజుల మనస్సులో స్ఫురింపజేశాడు. అంతేకాక, యాదవప్రకాశులకు వరదరాజస్వామి స్వప్నంలో కన్పించి, "నీవు శ్రీరామానుజులకు ఒక సారి ప్రదక్షిణం చేసి, త్రిదండి యతివి కావాలి'' అని ఆదేశించాడు.

4. **తిరునారాయణపురంలోని స్వామి-** తొండనూర్‌లో స్వప్నంలో శ్రీరామానుజులకు కన్పించి, వారిని తిరునారాయణపురానికి తీసికొని పోయి, వారికి ప్రసన్నుడైనందున, "నా శెల్వపిళ్ళా! రా'' అని పిలచి ఒడిలో కూర్చుండ పెట్టుకొనేటట్లు యతిరాజ కుమారులైన సౌశీల్యాన్ని ప్రదర్శించినందున శ్రీరామానుజ వైభవాన్ని ప్రకటించాడు.

5. **అ*ழ*కర్ (సుందరబాహుస్వామి)-** ఒకనాడు సభలో "మా శ్రీరామానుజుల దాసులకు అరుళ్‌పాడు'' అని సంతోషంగా అ*ழ*కర్ ఆహ్వానించాడు. "అపుడు అక్కడ ఉండే ఆచార్యులందఱు **"నాయన్‌తే"** అని వేంచేశారు కాని, పెరియనంబికి సంబంధించినవారు కొందఱు రాలేదు. అపుడు అ*ழ*కర్ "అందఱు వచ్చారు కాని, మీరు మాత్రం ఎందుకు రాలేదు?'' అని అర్చకముఖంగా ప్రశ్నించగా, వారు "శ్రీరామానుజుల దాసులు కదా పిలువబడ్డారు. వారు మాకు శిష్యులు. అందువల్ల మేము రాలేదు'' అని అన్నారు. "దశరథుడు వసుదేవుడు ఆయా అవతారాలలో నన్ను తమ పుత్రునిగా మీరు భావించడం వంటిదే శ్రీరామానుజులను మీకు శిష్యుడుగా భావించడం'' అని వారిని మందలించాడు. అంతేకాక, ఒకనాడు అ*ழ*కర్ కిడాంబిఆచ్చాన్‌ను పిలచి "ఏదయినా చెప్పండి'' అని ఆదరంగా అన్నాడు. అపుడు **ఆచ్చాన్ "అపరాధ సహస్రభాజనమ్"** అనే స్తోత్రరత్నశ్లోకాన్ని అనుసంధించారు. సుందర బాహుస్వామి "మన శ్రీరామానుజులుండగా **"అగతిః"** అని చెప్పవద్దు సుమా!- అని అన్నాడు.



6. **తిరుక్కుఱుఙ్గుడి నమ్బి -** శ్రీరామానుజులు తమ శిష్యులతో కలసి తిరుక్కుఱుఙ్గుడి నమ్బి సేవించడానికి వెళ్ళినపుడు, నమ్బి పెద్ద సభలో వేంచేసి ఉండి, శ్రీరామానుజులను ఆహ్వానించి, **"బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున!"** (అర్జునా! నాకు నీకు కూడా పలు జన్మలు గడిచాయి) అనే రీతిలో ఎన్ని జన్మలను నేను ఎత్తానో తెలియదు. ఆ అవతారాలలో నాకు ఒక్కరుకూడా దొరక లేదు. **"ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని, మా మప్రాప్యైవ కౌంతేయ! తతో యాంత్యధమాం గతిమ్"** (అర్జునా! జీవులు తమోగుణం ఎక్కువ కల్గిన ఆసురజన్మను పొందినవారై, ప్రతిజన్మలో మూఢులై, సర్వోత్తారకుడనైన నన్ను పొందకుండా, ఆయా జన్మలలో అధమగతిని పొందారు) అనే రీతిలో ఆసురస్వభావాన్ని కలవారై, జన్మించిన ప్రతిజన్మలో మూఢులై, నన్ను ఆశ్రయించక, అధమగతిపాలయ్యారు. ఈ ఆత్మలు మీకు ఏవిధంగా వశమయ్యారో? ఆ ఉపాయాన్ని నాకు కూడా చెప్పండి'' అని అన్నాడు.

అపుడు శ్రీరామానుజులు "స్వామీ ! మీరు అడుగవలసిన రీతిలో అడిగితేనే తెల్పుతాను'' అన్నారు. నమ్బి ! సింహాసనం నుండి కిందకు వేంచేసి, భూమిపై ఒరు రత్నకంబళిలో కూర్చుండి, శ్రీరామానుజులను సింహాసనంలో కూర్చుండబెట్టి, "ఇపుడు ఆ ఉపాయాన్ని చెప్పండి'' అని అన్నాడు. ఆ ఆసనంలో తమ ఆచార్యులు పెరియనంబి వేంచేసి ఉన్నట్లుగా భావించి శ్రీరామానుజులు నంబి కుడిచెవిలో హితాన్ని విన్నపించగా, అపుడు నమ్బి "ఆహా! మాశ్రీరామానుజులను ఆచార్యులుగా పొందానే! ఎంత భాగ్యం!'' అని ఆనందించాడు.

7. **నమ్మా*ழ*్వార్ :** లోకాన్ని సంస్కరించడంకోసం భగవానునితో పోటీపడి "లోకానికి నీ పట్ల భక్తిని కల్గిస్తాను'' అని పల్కిన ఆ*ழ*్వార్లు **"ఏ! పావమ్! పరమే!"** అని లోకులను చూచి క్లేశపడి, **"అకలిడత్తై ఆరాయ్‌న్దు అదు తిరుత్తలావదే!"** (విశాలమైన ఈ భూమిని పరిశీలించి, దానిని సంస్కరించడం సాధ్యమా?) అని, "భగవానుడు అవతరించి సంస్కరించలేని ఈ లోకాన్ని మనం సంస్కరించగలమా?'' అని వెనుకకు జంకి, **"యానుమ్ ఎన్నెఞ్జమ్"** (నేను, నా మనస్సు భగవానునకు అనుకూలం అయ్యాము) అని తాము, తమ మనస్సుమాత్రం భగవదానుకూల్యాన్ని పొందినట్లు పలికినప్పటికీ, శ్రీరామానుజులు అవతారాన్ని గుర్తించి **"కలియుమ్ కెడుమ్ కణ్డు కొణ్‌మిన్!"** (కలి నశిస్తుంది చూడండి) అని అన్నారు. అంతేకాక, శ్రీనాథమునులకు స్వప్నంలో శ్రీరామానుజుల రూపాన్ని దర్శింపజేసి, దానిని అర్చామూర్తిగా నిర్మింప జేసి, "మీరు జీవించి ఉన్నంతవరకు ఈ మూర్తిని ఆరాధించండి'' అని నియమించారు.

**8. శ్రీమన్నాథమునులు :** "గోష్పాదం నిండితే పిచ్చుక ఆ నీటిని తాగి జీవిస్తుంది. వీర నారాయణపురంలోని ఏరు నిండితే జగత్తు జీవిస్తుంది'' అని నాథమునులు పల్కినసూక్తి శ్రీరామానుజుల అవతారాన్ని గూర్చియే. ఎమ్బార్ **"లక్ష్మీనాథాఖ్య సింధౌ శఠరిపుజలదః ప్రాప్య కారుణ్య నీరం నాథాద్రావభ్యషించత్"** ఇత్యాది శ్లోకంలో "శ్రీరంగనాథుడనే మహాసముద్రంలో నమ్మాళ్వార్లు అనే వర్షాకాలమేఘం లోపలకు ప్రవేశించి, ఆ భగవానుని దివ్యగుణాలనే అమృతాన్ని తాగి, వచ్చి నాథమునులనే పర్వతంపై వర్షించింది. ఆ వర్షజలం ఉయ్యక్కొణ్డార్, మణక్కాల్‌నమ్బి- అనే ప్రవాహాలద్వారా కిందకు ప్రవహించి శ్రీయామునులు అనే గొప్ప చెఱువులో చేరి, అక్కడనుండి పెరియనమ్బి అనే పెద్దకాలువ ద్వారా వచ్చి, శ్రీరామానుజులనే గొప్ప చెఱువులో నిలచి, తేటపడి, మన ఆచార్యులనే తూములద్వారా బయటకు ప్రవహించి, ఈ సంసారమనే పొలంలోకి ప్రవహిస్తున్నది'' అని పల్కిన సూక్తి శ్రీరామానుజవైభవ ప్రఖ్యాపకం.

**9. శ్రీయామునులు :** "ఈ మహానుభావుడు ఈ సిద్ధాంతంలో ప్రవేశిస్తే బాగుండును'' అని **"ఇవన్ ముదల్‌వన్ ఆమ్"** అని యామునులు పల్కినందున, (చివరి దశలో తమ ముడుచుకొన్న మూడు చేతివేళ్ళను శ్రీరామానుజుల ప్రతిజ్ఞను వినగానే తెరచినందున) శ్రీరామానుజుల వైభవాన్ని ప్రకటించారు.

10. **పెరియనంబి :** ఒకనాడు పెరియనంబి, అత్తుళ్ళాయమ్మ ఇద్దఱు వేంచేసి ఉన్నపుడు, శ్రీరామానుజులు తమ శిష్యబృందంతో కలసి అక్కడకు వేంచేశారు. వెంటనే పెరియనంబి **"అత్తాళుక్కు త్తక్కతలైకాణ్, ఇదు"** (ఆ శ్రీచరణాలకు తగిన తల సుమా! ఇది) అని అన్నారట. ఒకనాడు, శ్రీరామానుజులు శిష్యులతో కలసి స్నానమాడి తిరగివచ్చేటపుడు పెరియనంబి వారిని చూచి, నమస్కరించారు. శ్రీరామానుజులు అంజలి చేస్తూ నిలచారు. దీనిని చూచి శిష్యులు "ఇదేమి !"అని శ్రీరామానుజులను ప్రశ్నించగా, "ఇపుడు వీరి అభిమతానుసారందగా కదా మనం వర్తించాలి''అని అన్నారు. వారు పెరియనంబి దగ్గరకు వెళ్ళి "శ్రీరామానుజులకు మీరు ఎందుకు సాష్టాంగంగా నమస్కరించారు?'' అని ప్రశ్నింగా, వారిని వారి శిష్యులను చూచి ఆళవందార్ శిష్యసమేతంగా వస్తున్నారని భావించాను- అని బదులిచ్చారు. "దీనికి ఏమి కారణం?" అని వారు మళ్ళీ ప్రశ్నించగా, పెరియనంబి "శ్రీయామునులకు తర్వాత ఆచార్యపూర్తి ఉన్నది శ్రీరామానుజులలోనే, అందువల్ల సదాచార్యసన్నిధికి, సచ్ఛిష్యసన్నిధికి తేడా లేనందున నమస్కరించాను'' అని అన్నారు. అంతేకాక తమకుమారులైన పుండరీకాక్షులను శ్రీరామానుజుల శ్రీచరణాలలో ఆశ్రయింపజేశారు.



**11. తిరుక్కోట్టియూర్‌నంబి :** శ్రీరామానుజులకు తిరుక్కోట్టియూర్‌నంబి తిరుమంత్రార్థాన్ని అనుగ్రహించేటపుడు "దీనిని ఎవరికీ చెప్పవద్దు'' అని ఆజ్ఞాపించారు. కానీ, శ్రీరామానుజులు దానిని ఆశను కలవారికి అందఱికి ఉపదేశించారు. నంబి దీనిని గమనించి కోపించి, శ్రీరామానుజులను పిలచి- "ఆచార్యాజ్ఞను అతిక్రమిస్తే ఏది ఫలమో తెలియదా?'' అని ప్రశ్నించగా, "నరకమే నాకు దీనివల్ల ప్రాప్తిస్తుంది'' అయినా, అందఱు జీవిస్తారని ఈ పని చేశాను''. అని శ్రీరామానుజులు బదులిచ్చారు. నంబి చాలా ఆనందించి, శ్రీరామానుజులను కౌగలించుకొని, **"ఎమ్బెరుమానార్ !"** అని సంబోధించి 'వారే కదా మీరు'' అని ఆశ్చర్యంగా పల్కి, "ఇప్పటినుండి ఈ సిద్ధాంతం ఎమ్బెరుమానార్ దర్శనమనే పేరుతో వ్యవహరింపబడాలి''- అని నియమించడమేకాక, తమ కుమారులు తెఱ్కాళ్వాన్‌ను శ్రీరామానుజుల వద్ద ఆశ్రయింపజేశారు.

**12. తిరుమలైనంబి :** శ్రీరామానుజులు తిరుమలకు వేంచేసినపుడు తిరుమలైనంబి వారికి ఎదురేగి ఆహ్వానించి తీర్థప్రసాదాలను ఇచ్చారు. శ్రీరామానుజులు వానిని స్వీకరించి "ఇంతదూరం మీరు రావాలా! వేఱెవ్వరు లేరా?'' అని అనగా, నమ్బి "ఈనాల్గు వీథులలో అంతటా గమనించినా, నాకంటే చిన్నవారెవ్వరూ కన్పించలేదు'' అని అన్నారు. ఎమ్బార్‌ను దానజలధార పూర్వకంగా శ్రీరామానుజులకు దానం చేశారు. తమ కుమారులైన రామానుజులను, పిళ్ళై తిరుమలైనంబిని శ్రీరామానుజుల పాదాలను ఆశ్రయింపజేశారు.

**13. తిరుమలైయాణ్డాన్ :** తిరుమలై యాణ్డాన్ సన్నిధిలో శ్రీరామానుజులు తిరువాయ్‌మొళి ప్రబంధాన్ని కాలక్షేపక్రమంలో శ్రవణం చేస్తున్నపుడు, **"అఱియాక్కాలత్తుళ్ళే" (తిరువాయ్-2-2-5)** అనే పాశురార్థానికి శ్రీరామానుజులు ఒక విశేషార్థాన్ని తెలుపగా, దానిని ఆణ్డాన్ అంగీకరించకుండా "ఇది విశ్వామిత్రసృష్టి'' అని కోపపడ్డారు. కాలక్షేపం నిలచిపోయింది. ఈ సంగతిని తిరుక్కోట్టియూర్‌నంబి విని శ్రీరంగానికి వేంచేసి, ఆణ్డాన్‌ను పిలచి "సాందీపని దగ్గకు శ్రీకృష్ణుడు అధ్యయనం చేసినట్లే, శ్రీరామానుజులు కూడా మీ దగ్గరకు కాలక్షేపం సేవిస్తున్నారని భావించండి. శ్రీరామానుజులు చెప్పిన అర్థాన్ని నేను ఒక పర్యాయం ఆళవన్దార్ దగ్గర విన్నాను''

అని అన్నారు. తరువాత కాలక్షేపం కొనసాగింది. మళ్ళీ ఒకసారి ఇంకొక పాశురానికి సరసమైన అర్థాన్ని చెప్పగా, ఆణ్డాన్ శ్రీరామానుజులతో "మీరు సాక్షాత్తుగా శ్రీయామునులను సేవించలేదు. కాని మీరు ఈవిధంగా ఆళవందార్ హృదయంలోని అర్థాలను ఏవిధంగా గ్రహించగలిగారు? అని ప్రశ్నించగగా, "నేను శ్రీయామునులకు ఏకలవ్య శిష్యుడను కదా!" అని శ్రీరామానుజులు సమాధానం పలికారు. "ఆహా ! ఇదికూడా ఒక అవతారవిశేషమే కదా !" అని ఆణ్డాన్ ఆశ్చర్యపడ్డారు. తమ కుమారులైన సుందరత్తోళుడైయాన్‌ను శ్రీరామానుజులను ఆశ్రయించేటట్లు చేశారుకూడా.

**14. తిరువరంగప్పెరుమాళ్ అరైయర్** : వీరు ఏవిధంగా వ్యక్తం చేశారంటే - శ్రీరామానుజులు అరైయర్ దగ్గర ఉండి ఆఱు నెలలపాటు వారికి పలు సేవలను చేశారు. విశేషించి తిరుమంజనసేవను చేశారు. వీరి సేవలకు అరైయర్ ప్రీతులై "నా సర్వస్వాన్ని గ్రహించడానికే కదా మీరీ విధంగా సేవచేస్తున్నారు." అని పల్కి, వారికి **"పంచమోపాయనిష్ఠ"** అనే ఆచార్యాభిమానాన్ని ఉపదేశించారు. తమ కుమారులు తిరువాయ్‌మొழி అరైయర్‌ను శ్రీరామానుజులకు శిష్యులుగా చేశారు.

**15. వడుగనంబి** : "ఆచార్యస్థానమనేది ఒక ప్రత్యేకమైన స్థానం. అది శ్రీరామానుజులకే తగినది. అందువల్ల, అందఱికి శ్రీరామానుజుల శ్రీచరణాలకు తప్ప ఇంకొక ఉపాయం లేదు. వారి శ్రీచరణాలే రక్షకం" అని వడుగనంబి అన్నారు.

**16. కణియనూర్ శిఱియాచ్చాన్** : సచేలస్నాన పూర్వకంగా ఆర్తితో, ఉపసత్తిని చేసి, "శ్రీరామానుజుల శ్రీచరణాలు తప్ప వేఱు గతి లేదు" అని శ్రీశఠకోపాన్ని శిరస్సుపై పెట్టుకొని కణియనూర్ శిఱియాచ్చాన్ ప్రతిజ్ఞ చేశారు.

**17. అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్** : తమ శ్రీచరణాలలో ఆశ్రయించిన ఎచ్చాన్, అనన్దాழ்వాన్, తొణ్డనూర్ నమ్బి, మరుతూర్‌నమ్బి- అనే ఆచార్యులతో 'శ్రీరామానుజులు, పిచ్చుక కంఠానికి తాటికాయను కట్టినట్లుగా, నన్ను మీకు ఆచార్యునిగా చేశారు. మీరుమాత్రం శ్రీరామానుజుల శ్రీచరణాలే రక్షకమని నమ్మండి" అని అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ ఉపదేశించారు.

**18. పిళ్ళై పిళ్ళై ఆழ்వాన్** : అనే ఆచార్యులు కూరేశులను ఆశ్రయించినపుడు కూరేశులు వారితో "మీరు నాకు ఆచార్యదక్షిణగా త్రివిధకరణాలతో భాగవతాపచారాన్ని చేయకుండా, భాగవతకైంకర్యాన్ని చేసికొనండి" అని అన్నారు. పిళ్ళైపిళ్ళై ఆழ்వాన్



"ఇది నాకు సాధ్యం కానిది కదా !" అని సంకోచించగా, కూరేశులు "ఎవరినైనా మనం శారీరకంగా బాధిస్తే ఆ వ్యక్తికూడా మనలను బాధిస్తాడు. అంతేకాక రాజదండన కూడా విధింపబడుతుంది. అందువల్ల కాయికాపరాధం చేయరాదు. ఇతరులపట్ల అపవాదాన్ని పల్కడమనేది మానసికాపరాధం. దానిని మానండి. ఇక, తెలియక మనస్సు ద్వారా అపచారపడితే, అపుడు పశ్చాత్తాపాన్ని పొంది, "శ్రీరామానుజుల శ్రీచరణాలే శరణమ్ అని నమ్మి ఉండండి" - అని పిళ్ళై పిళ్ళై ఆழ்వాన్‌తో అన్నారు.

**19. మిళకాழ்వాన్** : ముదలియాణ్డాన్‌తో "మీరు నాతో వాదించడానికి రండి" అని మిళకాழ்వాన్ వాదానికి పిలిచారు. ముదలియాణ్డాన్ "మీరు ఓడిపోతే ఏం చేస్తారు" అని అడిగారు. మిళకాழ்వాన్ "నేను ఓడితే మిమ్ములను నాభుజాలపై పెట్టుకొని మోస్తాను" అని అన్నారు. ఆ తరువాత వాదంలో మిళకాழ்వాన్ ఓడిపోయి, ఆழ்వాన్ తమ భుజాలపై పెట్టుకొని కొంత దూరం మోసి, "నన్ను అనుగ్రహించండి" అని అన్నారు. అపుడు ఆణ్డాన్ వారిని శ్రీరామానుజులను ఆశ్రయింపజేశారు. "శ్రీరామానుజుల శ్రీచరణాలే శరణమని నమ్మండి" అని హితాన్ని ఉపదేశించారు.

**20. ఎమ్బార్** : భట్టర్‌ను చూచి ఎమ్బార్, "శ్రీరంగనాథుడు నన్ను పుత్రునిగా స్వీకరించాడు నేను కూరేశపుత్రుడను. అన్ని శాస్త్రాలను అధికరించాను. అనే పరత్వభావనను కల్గి ఉండకుండా "శ్రీరామానుజులు శ్రీచరణాలే శరణ"మని విశ్వసించండి." అని అన్నారు.

**21. భట్టర్** : నంజీయర్‌ను చూచి **"వేదాంతి"**- అనే బిరుదును కల్గి ఉన్నాను. భట్టర్‌ను ఆశ్రయించి, వారికి భూరిధనాన్ని దక్షిణగా సమర్పించాను. అని గర్వించకండి. శ్రీరామానుజుల శ్రీపాదాలే రక్షకమని నమ్మండి- అని భట్టర్ అన్నారు.

**22. నంజీయర్** : నమ్బిళ్ళైతో - "లోకాచార్యులనే పేరును కల్గి ఉన్నాను. తిరువాయ్‌మొழிకి అర్థాన్ని చెప్పగలను." అని గర్వించవద్దు. **"ఎమ్బెరుమానార్ తిరువడికళే శరణమ్"** అని విశ్వసించండి" - అని నంజీయర్ అన్నారు.

**23. నమ్బిళ్ళై** : శివక్కరైప్పిళ్ళై అనే ఆచార్యుల చేతిని పట్టుకొని నమ్బిళ్ళై వేంచేసే సమయంలో, ఒక శ్రీవైష్ణవుడు నమ్బిళ్ళై ఇంటి అరుగుపై పరుండి ఉన్నాడు. శివక్కరైప్పిళ్ళై వారితో "కాలును ముడవండి"అని అన్నారు. నమ్బిళ్ళై ఆழ்వార్లు **"తిరుత్తాళ్"** అని భాగవతుల శ్రీచరణాలను గౌరవంగా నిర్దేశించినా, మీరు సామాన్యంగా 'కాలు"

అని అంటున్నారే!'' - అని కోపించినవారిని దూరం చేశారు. శివక్కరైప్పిళ్ళై "అయ్యో! ఈవిధంగా నన్ను ఆచార్యులు దూరం చేశారే ! నాకు ఏమి గతి?'' అని శోకించగా నమ్బిళ్ళై వారి పశ్చాత్తాపాన్ని చూచి వారిని దగ్గరకు పిలచి "మీకేమి లోటు లేదు సుమా! ఎమ్బెరుమానార్ తిరువడిగళే శరణమ్ - అని నమ్మండి''. అని పలికారు.

**24. తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ :** శిఋప్పుత్తూర్ అనేచోట పిళ్ళాన్ ఉన్నపుడు శోమాశియాణ్డాన్ వారి శ్రీచరణాలలో మూడు సార్లు శ్రీభాష్యాన్ని సేవించారు. పిళ్ళాన్ తిరిగివచ్చేటపుడు శోమాశియాణ్డాన్ వారిని సేవించి "దాసుడుండే చోటు ఇది. ఇక్కడ నాకు రక్షకంగా ఉండే స్మరించదగిన ఒక సూక్తిని ఉపదేశించండి.'' అని అర్థించగా పిళ్ళాన్ "భాట్టప్రాభాకరమీమాంసాశాస్త్రాలకు నేను అర్థాన్ని చెప్పగలవాడను - అని గర్వించకుండా, "శ్రీరామానుజుల శ్రీపాదాలే గతి'' అని భావించండి'' అని అన్నారు.

**25. గోమఠత్తుపిళ్ళాన్ :** వీరి సన్నిధిలో కాక్కైప్పాడి ఆచ్చాన్‌పిళ్ళై అనేవారు శ్రీభాష్యాన్ని మూడుసార్లు అధ్యయనం చేశారు. అందువల్ల ఆచ్చాన్‌పిళ్ళై చాలా గర్వంగా వర్తించడం గమనించి, పిళ్ళాన్ "వీరు అపచారపడే అవకాశం ఉన్నది'' అని తలచి భయపడి, "మీరు శ్రీరామానుజుల శ్రీచరణాలే రక్షకమని ఉండండి'' అని ఉపదేశం చేశారు.

**26. ఎఙ్గళాழ్వాన్ (విష్ణుచిత్తార్యులు) :** ఎఙ్గళాழ்వాన్ కాక్కైప్పాడి ఆచ్చాన్‌పిళ్ళైను చూచి, "మిమ్ములను శ్రీరంగనాథుడు కోపించినపుడు మీరేకుని తలచారు?'' అని ప్రశ్నించగా, ఆచ్చాన్‌పిళ్ళై "ఎమ్బెరుమానార్ శ్రీచరణాలే రక్షకం - అని నమ్మి ఉన్నాను''- అని బదులిచ్చారు.

**27. నడాదూర్ అమ్మాళ్ :** తమ సన్నిధిలో శ్రీభాష్యాన్ని అధికరించిన పది పన్నెండుమంది ఆచార్యులు "భక్తి గురువైన ఉపాయంగా తోస్తున్నది'' అని అనగా, వారికి అమ్మాళ్ ప్రపత్తిని ఉపదేశించారు. అదికూడా అరుదైన ఉపాయం'' అని వారు విన్నపించగా, అయితే, "ఎమ్బెరుమానార్ తిరువడికళే శరణమ్ - అని విశ్వసించి ఉజ్జీవించండి'' అని అన్నారు.

**28. నడువిల్ ఆழ்వాన్ :** వీరు తిరునారాయణపురంలో ఉండి, శ్రీభాష్యాన్ని అధ్యయనం చేసే కాలంలో వీరివద్ద వఙ్గిపురత్తాయ్, శొట్టై అమ్మాళ్ మొదలైనవారు శ్రీభాష్యాన్ని అధ్యయనం చేశారు. అపుడు "ఈ గ్రంథం చాలా క్లిష్టంగా ఉన్నది'' అని భావించగా, "అయితే, దీనిని అనుగ్రహించిన శ్రీరామానుజుల శ్రీచరణాలే రక్షకం'' అని భావించండి - అని నడువిల్ ఆழ்వాన్ అన్నారు.



**29. శ్రీవేదవ్యాసభట్టర్ :** తిరునారాయణపురంలో భగవద్రామానుజుల ముందు గోష్ఠిని చేసి, శ్రీవేదవ్యాసభట్టర్ శ్రీభాష్యాన్ని ఉపన్యసించగా, "ఇది గంగాప్రవాహం వలె గంభీరంగా ఉన్నది. మాకు గ్రహించడం వీలుకాకున్నది'' అని 52 మంది కైంకర్యపరులైన శ్రీవైష్ణవులు విన్నపించారు. అపుడు భట్టర్ "అయితే మన కులదైవమైన శ్రీరామానుజుల శ్రీచరణాలే రక్షకమని తలచి ఉజ్జీవించండి'' అని అన్నారు.

**30. నడువిల్ తిరువీధిపిళ్ళై :** నడువిల్ తిరువీధిపిళ్ళై వెళ్ళైక్కుళమ్ అనే చోట ఆనైకాత్త శిఙ్గర్ అనే అర్చామూర్తి ముందు శ్రీభాష్యాన్ని ఉపన్యసించగా, వారి శిష్యులు ఇళైయ అழகియార్ "ఇది గంగాప్రవాహంగా ఉన్నది. నాకు గ్రహించడానికి సాధ్యం కాదు'' అని అన్నారు. అపుడు పిళ్ళై "అయితే, ఎమ్బెరుమానార్ శ్రీచరణాలే కదా శరణం''' అని అనుగ్రహించారు.

**31. మూగవాడు :** పెరుమాళ్ కోయిల్ (కంచి) లో జన్మించిన మూగవాడొకడు అయిదాఋ సంవత్సరాల వయస్సు వరకు మూగవాడై ఉన్నాడు. తరువాత, రెండేళ్ళ కాలం పాటు అతడు ఎవరికీ కన్పించలేదు. తరువాత ఒకనాడు తిరిగి కన్పించాడు. చక్కగా మాట్లాడగల్గిన శక్తితో ఉండే అతనిని చూచి అందఋ ఆశ్చర్యపడి "ఇంతకాలం నీవెక్కడకు పోయావు ?'' అని అడిగారు. అతడు "నేను క్షీరాబ్ధిని దర్శించాను'' అని అనగా, "అచట ఏమి విశేషం'' అని అడుగగా, "శ్రీవిష్వక్సేనులు ఎమ్బెరుమానార్‌గా అవతరించారు- అనేది ఒక విశేషం'' అని పల్కి చటుక్కున అదృశ్యమయ్యాడు.

**32. బ్రహ్మరక్షస్సు :** శ్రీరామానుజ వైభవాన్ని బ్రహ్మరక్షస్సు ప్రకటించిన రీతి ఇంతకముందే తెలుపబడింది. ఇంకా పలువురు పలు రీతులలో శ్రీరామానుజుల వైభవాన్ని ప్రకాశింపజేశారు.

## భగవద్రామానుజుల దివ్యగ్రంథాలు

భగవానుని వైభవంవలె శ్రీరామానుజుల వైభవం కూడా వర్ణించడానికి సాధ్యం కానిది. ఈ ఆచార్య సార్వభౌములు రచించిన గ్రంథాలు నవనిధులవలె, నవరత్నాలవలె తొమ్మిది. అవి- వేదార్థ సంగ్రహం, శ్రీభాష్యం, వేదాంతదీపం, వేదాంతసారం, శరణాగతిగద్యం, శ్రీరంగగద్యం, వైకుంఠగద్యం, నిత్యగ్రంథం, గీతాభాష్యం.

## శ్రీరామానుజుల అవతార సమాప్తి

ఈవిధంగా శ్రీరామానుజుల అతిమానుష కార్యాలను ఎన్నిటినో నిర్వహించి అవతార ప్రయోజనాన్ని పూర్తిచేసిన తర్వాత పరమపదాన్ని చేరి భగవానుని నిత్య కైంకర్యాన్ని నిర్వహించాలని నిశ్చయించుకున్నారు. ఒకనాడు శ్రీరంగనాథుని సేవించి తమ పరమపదయాత్రకోసం ఆస్వామి అనుజ్ఞను పొందారు. శిష్యుల ఉజ్జీవనాన్ని కోరి 72 సద్వార్తలను అనుగ్రహించారు. సారతమంగా "**శ్రీభాష్యద్రవిడాగమ ప్రవచనం శ్రీశస్థలేష్వన్వహమ్, కైంకర్యం యదుశైలనిత్యవసతి: సార్థం ద్వయోచ్చారణమ్, యద్వా భాగవతాభిమానవసతి: శ్రేయ స్సతా మిత్యలమ్**" (ఉభయవేదాంతాల ప్రవచనం, భగవానుడు వేంచేసి ఉండే దివ్యదేశాలలో కైంకర్యం, తిరునారాయణపురంలో నిత్య నివాసం, ద్వయమంత్రాన్ని అర్థంతోపాటు అనుసంధించడం, ఇవి ఏవి చేయలేకపోయినా, కనీసం ఒక భాగవతుని అభిమానానికి పాత్రం కావడం) అని ప్రపన్నుని కర్తవ్యాన్ని బోధించారు.

మాఘమాసం శుద్ధ దశమి శనివారం మధ్యాహ్న సమయంలో శ్రీరామానుజులు అవతార సమాప్తిని చేశారు. వీరి చరమకైంకర్యాలను వీరి అభిమాన పుత్రులైన తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ నిర్వహించారు.

ఈ రామానుజుల అర్చావిగ్రహాలు శ్రీరంగం, తిరుమల, కంచి, మేల్కోటై మొదలైన ప్రసిద్ధ క్షేత్రాలలోనే కాక పలు ప్రదేశాలలోని శ్రీవైష్ణవ దేవాలయాలలో వేంచేసి ఉన్నాయి. శ్రీరామానుజుల ఆరాధనలేని ఆలయం పెద్దల మన్ననకు పాత్రం కాదు అంటే శ్రీవైష్ణవ సంప్రదాయంలో శ్రీరామానుజుల స్థానం ఎంత ఉన్నతమైనదో తెలియవచ్చు.

18వ శతాబ్దం ఉత్తరభాగంలో ఈస్టిండియా కంపెనీలో దుబాసీగా పనిచేసిన పరమభాగవతులు శ్రీమాన్ పుప్పాల రమణప్పనాయుడుగారు తమ ఆచార్యులైన ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రామానుజాచార్య స్వామివారి ఆదేశానుసారం నరసాపురంలో భగవద్రామానుజ దివ్యాలయాన్ని శ్రీపెరుంబూదూర్‌లో గల శ్రీరామానుజుల కోవెల నమూనాలో నిర్మింపజేయడమేకాక, ఆ కోవెలలో శ్రీపెరుంబూదూర్‌లోని ఆచార వ్యవహారాల క్రమంలో నిత్యారాధన, ఉత్సవాది నిర్వహణలు జరిగేటట్లు ఏర్పరచారు. ఈ ఆలయం కారణంగా నరసాపురానికి అభినవభూతపురి అనే ప్రసిద్ధనామం



ఏర్పడింది. ఇక్కడ వేంచేసి ఉండే శ్రీరామానుజులు భక్తుల కొంగుబంగారంగా విలసిల్లుతున్నారు.

శ్రీరామానుజులు శ్రీభాష్యంలో భేద, అభేద, ఘటక శ్రుతుల సమన్వయాన్ని చేసినట్లే, సంస్కృత వేదాంత, ద్రావిడవేదాంతాలనే ఉభయవేదాంతాల సమన్వయాన్ని చేశారు. తమ జీవితంలో కూడా పలురీతులలో సమన్వయాన్ని సాధించారు. వారు చూపిన సమన్వయ సిద్ధాంతం, వారు అనుసరించిన సత్పథం, వారు చేసిన సదుపదేశాలు చిరస్మరణీయాలు. నిత్యం అనుసరణీయాలు.

శ్రీరామానుజుల వైభవాన్ని తెలియజేసే గ్రంథాలు, స్తుతులు వారు జీవించి ఉండగానే కొన్ని ఆవిర్భవించాయి. ఆంధ్రపూర్ణుల యతిరాజవైభవం, గరుడవాహన పండితుని దివ్యసూరిచరితం, తిరువరంగత్తముదనార్ అనుగ్రహించిన ఇరామానుశ నూఱ్ఱన్దాది, శ్రీశైలఅనంతార్యుల రామానుజ చతుఃశ్లోకి మొదలైనవి వీటిలో కొన్ని. తర్వాతి కాలంలో కూడా గురుపరంపరాప్రభావమ్, ప్రపన్నామృతమ్, శ్రీరామానుజ దివ్యచరిత్తై, యతిరాజసప్తతి, యతిరాజవింశతి మొదలైన పలు గ్రంథాలలో శ్రీరామానుజుల చరిత్ర తెలుపబడింది. ద్రావిడభాషలో వడివళకియ నంబిదాసర్ రచించిన రామానుజ వైభవం ఒక మధుర పద్యప్రబంధం. తెలుగులో ఆచార్య సూక్తిముక్తావళి అనే అందమైన ప్రబంధంలో శ్రీరామానుజుల చరిత్ర వర్ణింపబడింది. ఇవేకాక పలుభాషలలో ఎన్నో ప్రబంధాలు, స్తుతులు రామానుజుల విషయంగా ఆవిర్భవించాయి. శ్రీరామానుజ సహస్రాబ్ది మహోత్సవ సందర్భంలో వారి పవిత్ర చరిత్రలోని ప్రధానాంశాలు సంగ్రహంగా నివేదించాలనే ఉద్దేశ్యంతో ఈగ్రంథ రచన చేయబడడం వల్ల చాలా విశేషాలు, వృత్తాంతాలు ఇందులో చోటుచేసికోలేదు. అయినా, మధురమైన వస్తువును కొంచెం ఆస్వాదించిన అది ఆనందకరమే కదా!

**పుణ్యాంభోజవికాసాయ పాపధ్వాంతక్షయాయ చ ।**
**శ్రీమాన్నావిరభూద్భూమౌ రామానుజదివాకర : ॥**

(పుణ్యమనే తామరపూవు వికసించడంకోసం, పాపమనే చీకటి నశించడం కోసం గొప్ప తేజస్సును కల రామానుజులనే సూర్యుడు భూమిలో అవతరించారు.)

శ్రీమతే రామానుజాయ నమః

ఆంధ్రపూర్ణులు (వడుగనంబి) అనుగ్రహించిన

# శ్రీ రామానుజాష్టోత్తర శతనామ స్తోత్రమ్

రామానుజః పుష్కరాక్షో యతీన్ద్ర కరుణాకరః ।
కాన్తిమత్యాత్మజః శ్రీమాన్ లీలామానుష విగ్రహః ॥

సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞః స్సర్వజ్ఞ సజ్జన ప్రియః ।
నారాయణ కృపాపాత్రం శ్రీభూతపురనాయకః
అనఘో భక్తమన్దారః కేశవానన్దవర్ధనః ।
కాఞ్చీపూర్ణ ప్రియసఖః ప్రణతార్తి వినాశకః ॥

అమోఘో లక్ష్మణ మునిః శారదా శోకనాశనః ।
నిరన్తరజనాజ్ఞాన నిర్మోచన విచక్షణః ॥

పుణ్య సఙ్కీర్తనః పుణ్యో బ్రహ్మరాక్షస మోచకః ।
యాదవాపాదితాపార్థ వృక్షచ్ఛేద కుఠారకః ॥

వేదాన్తద్వయ సారజ్ఞో వరదాయామ్బుదాయకః ।
*పరేఙ్గితజ్ఞో నీతిజ్ఞో యామునాఙ్గుళిమోచకః ॥

దేవరాజ కృపాలబ్ధ షడ్వాక్యార్థ మహోదధిః ।
పూర్ణార్యలబ్ధ సన్మన్త్రః శౌరిపాదాబ్జ షట్పదః ॥

త్రిదణ్డధారీ బ్రహ్మజ్ఞో బ్రహ్మధ్యానపరాయణః ।
రంగేశ కైఙ్కర్యరతో విభూతిద్వయ నాయకః ॥

*పరాభిప్రాయతత్త్వజ్ఞః - అనే పాఠాంతరం ఉన్నది.



గోష్ఠీపూర్ణ కృపా లబ్ధ మన్త్రరాజ ప్రకాశకః ।
*వరరఙ్గానుకమ్పాత్త ద్రావిడమ్నాయ పారగః ॥

మాలాధరార్య సుజ్ఞాత ద్రావిడామ్నాయతత్త్వధీః ।
చతుస్సప్తతిశిష్యాఢ్యః పఞ్చాచార్య సమాశ్రయః ॥

ప్రపీత విషతీర్థాంభః ప్రకటీకృత వైభవః ।
ప్రణతార్తి హరాచార్య దత్త భిక్షైక భోజనః॥

పవిత్రీకృత కూరేశో భాగినేయ త్రిదణ్డకః ।
కూరేశ దాశరథ్యాది చరమార్థ ప్రదాయకః ॥

రఙ్గేశ వేఙ్కటేశాది ప్రకటీకృత వైభవః ।
దేవరాజార్చనరతో మూకముక్తి ప్రదాయకః ॥

యజ్ఞమూర్తి ప్రతిష్ఠాతా మన్నాథో ధరణీధరః ।
వరదాచార్య సద్భక్తో యజ్ఞేశార్తి వినాశక ః ॥

అనన్తాభీష్ట ఫలదో విఠ్ఠలేంద్ర ప్రపూజితః ।
శ్రీశైలపూర్ణ కరుణాలబ్ధ రామాయణార్థకః ॥

పపత్తిధర్మైకరతో గోవిన్దార్య ప్రియానుజః ।
వ్యాససూత్రార్థ తత్త్వజ్ఞో బోధాయనమతానుగః ॥

శ్రీభాష్యాది మహగ్రంథకారకః కలినాశనః ।
అద్వైతమత విచ్ఛేత్తా విశిష్టాద్వైత పాలకః ॥

కురంగనగరీపూర్ణ మన్త్ర రత్నోపదేశకః ।
వినాశితాఖిలమతః శేషీకృత రమాపతిః ॥

* వరరంగానుకంపీ చ - అనే పాఠాంతరమున్నది.

పుత్రీకృత శఠారాతిః శఠజిత్సూక్తివర్ధనః ।
భాషాదత్త హయగ్రీవో భాష్యకారో మహాయశాః ॥

పవిత్రీకృత భూభాగః కూర్మనాథప్రకాశకః ।
శ్రీవేఙ్కటాచలాధీశ శంఖచక్రప్రదాయకః ॥

శ్రీవేఙ్కటేశ శ్వశురః శ్రీరమాసఖ దేశికః ।
కృపామాత్ర ప్రపన్నార్యో గోపికా మోక్షదాయకః ॥

సమీచీనార్య సచ్చిష్యసత్కృతో వైష్ణవ ప్రియః ।
క్రిమికంఠ నృపధ్వంసీ సర్వమన్త్ర మహోదధిః ॥

అఙ్గీకృతాంధ్రపూర్ణాఖ్యః సాలగ్రామ ప్రతిష్ఠితః ।
శ్రీభక్తగ్రామ పూర్ణేశో విష్ణువర్ధన రక్షకః ॥

బౌద్ధధ్వాన్త సహస్రాంశుః శేషరూపప్రదర్శకః ।
నగరీకృత వేదాద్రిః దిల్లీశ్వర సమర్చితః ॥

నారాయణప్రతిష్ఠాతా సమ్పత్పుత్ర విమోచకః ।
సంపత్కుమారజనకః సాధులోక శిఖామణిః ॥

సుప్రతిష్ఠిత గోవిన్దరాజః పూర్ణ మనోరథః ।
గోదాగ్రజో దిగ్విజేతా గోదాభీష్టప్రపూరకః ॥

సర్వసంశయవిచ్ఛేత్తా విష్ణులోక ప్రదాయకః ।
అవ్యాహతమహద్వర్త్మా యతిరాజో జగద్గురుః ॥

ఏవం రామానుజార్యస్య నామ్నామష్టోత్తరం శతమ్ ।
యః పఠేత్ శ్రుణుయాద్వాపి సర్వాన్ కామానవాప్నుయాత్ ॥

యదాన్ధ్రపూర్ణేన మహాత్మనేదం స్తోత్రం కృతం సర్వజనావనాయ ।
తజ్జీవభూతం భువి వైష్ణవానాం బభూవ రామానుజ మానసానామ్ ॥

శ్రీమదాన్ధ్రపూర్ణ విరచితం శ్రీరామానుజాష్టోత్తర శతనామస్తోత్రం సమాప్తమ్



## శ్రీరామానుజుల మంగళాశాసన పాశురాలు

అఱుశమయ చ్చెడియదనై యడి యఱుత్తాన్ వాఴియే
అడర్న్దు వరుమ్ కుదిట్టికళై అఱ త్తుఱన్దాన్ వాఴియే
శెఱు కలియై చ్చిఱిదు మఱ త్తీర్త్తవిట్టాన్ వాఴియే
తెన్నరఙ్గర్ శెల్వ ముఱ్ఱుమ్ తిరుత్తివైత్తాన్ వాఴియే
మఱైయదనిల్ పొరుళనైత్తుమ్ వాయ్మొఴిన్దాన్ వాఴియే
మాఱనురై శెయ్ద తమిఴ్మఱై వళర్త్తోన్ వాఴియే
అఱమికు నఱ్పెరుమ్బూదూర్ అవతరిత్తాన్ వాఴియే
అఴకారు మెతిరాశర్ అడియిణైకళ్ వాఴియే

వేదబాహ్యాలైన ఆఱు మతాలనే (మహా) వృక్షాలను సమూలంగా ఛేదించిన వానికి మంగళం. గుంపులు గుంపులుగా తనపైకి వాదించడంకోసం వచ్చే కుదృష్టి మతస్థులను సవాసనగా (పూర్తిగా) తఱిమికొట్టినవానికి మంగళం. లోకం అంతటా గాఢంగా ఆవరించే కఠినమైన కలిని కొంచెంకూడా మిగిలి ఉండకుండా ఉండేటట్లుగా నశింపజేసినవానికి మంగళం. దక్షిణదిక్కులోని, అందమైన శ్రీరంగనాథుని సకల సంపదలను తన ఆజ్ఞానుసారంగా సంస్కరించినవానికి మంగళం. వేదాలలో ప్రతి పాదింపబడే అర్థాలను అన్నిటినీ శ్రీభాష్యరూపంలో అనుగ్రహించినవానికి మంగళం. నమ్మాఴ్వార్లు అనుగ్రహించిన, ద్రావిడవేదాలుగా ప్రసిద్ధిచెందిన ప్రబంధాలను వృద్ధిచేసిన వానికి మంగళం. ఆ ప్రబంధాలలో ప్రతిపాదింపబడ్డ శరణాగతి ధర్మం లోకంలో అభివృద్ధికావడంకోసం విలక్షణం అయిన శ్రీపెరుంబూదూర్‌లో అవతరించిన వానికి (లేక, ధర్మం నిండుగా ఉండే శ్రీపెరుంబూదూర్‌లో అవతరించిన వానికి) మంగళం. సౌందర్యాదులతో పూర్ణంగా ఉండే భగద్రామానుజుల శ్రీచరణాల జంటకు నిత్య మంగళం.

శీరారు మెతిరాశర్ తిరువడికళ్ వాఴి
తిరువరైయిల్ శాత్తియ శెన్దువరాడై వాఴి
ఏరారుమ్ శెయ్య వడి వెప్పొఴుదుమ్ వాఴి
ఇలఙ్గియ మున్నూల్ వాఴి ఇణైత్తోళ్కళ్ వాఴి
శోరాద తుయ్య శెయ్య ముగచ్చోది వాఴి
తూ ముఱువల్ వాఴి తుణైమలర్ కణ్గళ్ వాఴి
ఈరాఱు తిరునామ మణిన్ద వెఴిల్ వాఴి
ఇనిదిరప్పోదెఴిల్ ఞానముత్తిరై వాఴియే

కల్యాణగుణాలు నిండుగా ఉండే యతిరాజుల శ్రీపాదాలు సదా వర్ధిల్లాలి. (వారు) నడుములో ధరించిన ఎఱ్ఱని కాషాయవస్త్రం వర్ధిల్లాలి. సౌందర్యంతో నిండిన ఎఱ్ఱని, అందమైన దివ్యమంగళవిగ్రహం సదా వర్ధిల్లాలి. వక్షఃస్థలంలో ప్రకాశించే బ్రహ్మసూత్రం వర్ధిల్లాలి. బంగారు కల్పవృక్షాలవలె మోక్షప్రదాలుగా ఉండేవి, సంసారి చేతనుల రక్షణసామర్థ్యాన్ని కల్గినవి అయిన (వారి) భుజాలు రెండు వర్ధిల్లాలి. అనుభావ్య మైనది, నిర్మలమైనది, శుభావహం అయినది అయిన తిరుముఖమండలం లోని శోభ వర్ధిల్లాలి, భగవదనుభవంవల్ల, ఆశ్రితరక్షణవల్ల కల్గిన ఆనందంచేత పుట్టిన చిఱు నవ్వు వర్ధిల్లాలి. వికసించిన తామరపూలవంటి అందమైన (వారి) తిరునేత్రాలు వర్ధిల్లాలి. పూర్వం వర్ణించిన వానికి అన్నిటికీ ప్రకాశకమై, శ్రీవైష్ణవశ్రీని వర్ధిల్లజేసేవై, స్వర్ణపర్వత సమీపంలో అంతటా తామరపూలు పుష్పించినట్లుండే, ఎఱ్ఱని తిరుమేనిలో అలంక రించుకొన్న ద్వాదశోర్ధ్వపుండ్రాల ధారణచేత కల్గిన (వారి) అందం వర్ధిల్లాలి. పద్మాసనంలో వేంచేసి ఉండే సన్నివేశంలో ఉభయవేదాంతార్థప్రకాశకంగా ఉండే, పరతత్త్వ బోధకం అయిన జ్ఞానముద్రతో కూడిన (వారి) శ్రీహస్తం వర్ధిల్లాలి.

## నాళ్పాట్టు

శఙ్కరబాఱ్కర యాదవబాట్ట పిరబాకరర్తఙ్గళ్ మతమ్
శాయ్ వుఱ వాదియర్ మాయ్వురు మెన్ఱు శదుమఱై వాఴ్న్దిడునాళ్
వెఙ్గలి యిఙ్గిని వీఱు నమక్కిలై యెన్ఱు మిక త్తళర్నాళ్
మేదిని నఙ్జుమై యాఱు మెన త్తుయర్విట్టు విళఙ్గియనాళ్
మఱైయరాళి పరాఙ్గుశ మున్నవర్ వాఴ్వు ముళైత్తిడునాళ్
మన్నియ తెన్నరఙ్గాపురి మామలై మఱ్ఱు మువన్దిడునాళ్
శెఙ్గయల్ వావికళ్ శూఴ్ వయల్నాళుమ్ శిఱన్ద పెరుమ్బూదూర్
శీమా నిళైయాఴ్వార్ వన్దరుళియనాళ్ తిరువాదిరై నాళే

శంకరాచార్యులవారి మతమైన అద్వైతం, భాస్కరమతం, యాదవప్రకాశుని మతం, భాట్టమతం, ప్రాభాకరుని మతం - ఇవి అన్నీ నాశాన్ని పొందగా, వాదించేవారు నిర్జితులై నశించి, నాల్గు వేదాలు వాటి యథార్థ ప్రతిపాదనవల్ల వృద్ధిపొందే సుదినం, క్రూరుడైన కలిపురుషుడు “ఇక నాకు ఇక్కడ శక్తి సామర్థ్యాలు లేవు”అని, చాలా తల్లడిల్లేటట్లుచేసే సుదినం. భూమి ఇక నా భారం తొలగిపోతుందని దుఃఖాన్ని వీడి సంతోషించే సుదినం. అర్చావతారాలను ఆదరించే తిరుమఴైయాఴ్వార్ల, నమ్మాఴ్వార్ల, మిగిలిన పూర్వాచార్యులయొక్క సంపద అంకురించే సుదినం. స్థిరమైన గొప్పదైన తిరుమలై, మిగిలిన దివ్యదేశాలు అన్నీ ఆనందించే సుదినం - ఏది అంటే, ఎఱ్ఱని అందమైన చేపలను కల సరస్సులను చుట్టూ కల్గిన పంటభూములలో ఎల్లప్పుడూ గొప్పగా అందంగా ఉండే శ్రీపెరుంబూదూర్లో భక్తికైంకర్యలక్ష్మీసంపన్నులైన శ్రీరామానుజులు అవతరించిన ఆర్ద్రానక్షత్రమే.